శ్రీమత్పరదేవతాయై నమః

# తొలిపలుకు.

శ్లో॥ "రాధా పునాతు జగ దచ్యుతద త్తచిత్తా
మంథాన మాకలయతీ దధిరి క్తపాత్రే
తస్యా స్తన స్తబక చంచలలోలదృష్టి
ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్."
(శ్రీకృష్ణకర్ణామృతమ్)

అని లీలాశుకులు వచించిన తెఱంగున రాధాంబిక శ్రీకృష్ణ స్వామియందు తనకుంగల నిజమైన భక్తిసాగరమం దోలలాడుచు దధిరి క్తపాత్రమందు గవ్వ ుంచి చిలుకుటయు శ్రీకృష్ణపరమాత్మయు రాధాదేవియందు దత్తచిత్తుఁడై వృషభమును బందపుఁదాటఁ గట్టుటయు జూడంజూడ రాధాకృష్ణులకుఁగల నైసర్గికములగు భక్త్యనురాగములు వెల్లడి యగుచున్నవి.

ఈతత్వ మనుసరించియే రాధాకృష్ణుల భక్త్యనురాగములను వర్ణించుచు నిట్టి పవిత్రమైన దృశ్యప్రబంధమును వ్రాయు భాగ్యము నాయట్టి యల్పమతి కొదవినందుల కెంతయో సంతసిల్లుచుంటిని.

ఈరూపకమందు బురాణదంపతులగు రాధాకృష్ణులకు సృష్టికర్తయగు విధాతయే స్వయముగా బాణిగ్రహణ మొనరించినట్లు నాటకాంతమున సంఘటింపఁబడుటంజేసి,

క ల్యా ణ రా ధా మా ధ వ

మను పేరడపలసి వచ్చినది. ఇదియే నాటకమునకు ఫలం బనియు నెఱుఁగఁదగు.

ఇటులుండఁ గొందఱు రాధాకృష్ణుల తత్వ మెఱుంగని దేవానాం ప్రియులు "జారిణియగు రాధ కెట్లు పరిణయ మొనరింపఁబడిన దనియు నియ్యది యంతగా సమంజసము గాదనియు, రాధ శ్రీకృష్ణుని

భార్య కాదనియు, రుక్మిణియే భార్యయనియు, రాధాంబిక యాయమ్మకుఁ బరిచారికగావచ్చు" ననియు పలుకు వాక్యములను స్వయముగా వినిన వాఁడ నగుట నిట్లు వ్రాయఁగడంగిన నన్ను విజ్ఞులు క్షమింతురు గాక.

ఇఁక భగవానుఁ డగుశ్రీకృష్ణుఁడు జారచోర శిఖామణి యనియు దుష్టుఁడనియు నింక నేమేమో నోటికి వచ్చినట్లు పలువిధంబుల నిందించు పండితంమన్యుల కొకనమస్కార మొనరించుటయే సర్వోత్తమ మని తోఁచుచున్నది. మఱియు నమ్మహామహుని యథార్థమగు ప్రభావము గుర్తెఱుంగ కుండుటయే యిట్టి నిందకుఁ గారణమని మన మూహింపవలసియుండును.

శ్రీకృష్ణపరమాత్మ, బృందావనస్థిత భాండీర పుణ్యోపవనమందు నలువను బురోహితునిగా నొనరించుకొని తనకు స్వకీయయగు, రాధామహాదేవిని వివాహమాడె ననుట కీ క్రింది పద్యములె తార్కాణము లగుచున్నవి.

ఉ॥ "మంగళ వాద్యముల్ శ్రవణమాధురిగా మెఱయన్ సరస్వతీ
సంగుఁడభంగురాభరణజాల లసద్వృషభాను పుత్రికా
మంగళ కంఠమం దవనిమండల నాటకసూత్రధారిచే
మంగళకార్య కారియగు మంగళసూత్రము గట్టఁ జేసియున్.

చ॥ చని మిథునంబు ముంగలఁ గృశానునిఁ బ్రజ్వలితుం బొనర్చి యిం
ధన ఘృత తండులంబుల యథావిధి హోమ మొనర్పఁ జేసి రా
ధను గమలాక్షుఁ గైకొని ప్రదక్షిణముల్ దగసల్పఁ జేసి వే
డ్కను నిగమోక్త సప్తపది కార్యముగా నొనరించి పిమ్మటన్.

చ॥ హరి యురమందు రాధ కర మా హరిహస్తము రాధ యొమ్మునన్
వరలఁగఁజేసి మంత్రముల బాఠ మొనర్పఁగసల్పి హార మా
పురుష వరేణ్యు కంఠమున బొల్చుక యాజలజాక్షుఁ డా సతీ
వరగళమందు వేయుటయుఁ బల్మరొనర్చి ముదాన్వితాత్ముఁడై."

—(ఆంధ్రీకృత శ్రీ గర్గభాగవతము, గోలోక ఖండము)

ఇటుల వేదోక్త ప్రకారముగా రాధామాధవులకు విధాఁత పెండ్లిఁగావించెను. నాటకమం దట్లుగాదు. రాధహస్తమును మా

వుని కరమందునను, మాధవుని పాణిపంకజము రాధ చేతియందును నుండునట్లు జేసి సృష్టికర్త ముదాన్వితుండై ప్రక్కన నిలువఁబడి యుండ నింతలో వృషభానుఁడు తన కొమరితచే మందారమాలను నలువ యెదుటఁ గృష్ణుని మెడలో వేయించును. ఇదియే విధాతృకృత రాధా మాధవ పాణిగ్రహణమహోత్సవము గా నాటకమందు పరిగ ణింపఁబడినది. ఇఁక బ్రకృత మనుసరింతము.

ఇంతవరకు రాధికయన నెట్టిదియో వివరింపనేలేదు. శ్రీకృష్ణా నపాయినియగు నీరాధాంబిక పరదేవత యనంబడు. ఈపెయే మూల ప్రకృతి.

శ్లో॥ రాధ్నోతి సకలాన్ కామాన్ తస్మా "ద్రాధే" తికీర్తితా॥
—(దేవీభాగవతమ్)

రాధ్నోతి=సాధయతీత్యర్థః (అని వ్యాఖ్యానము). అనగా కోరిన కోర్కులను సాధించి (ఇచ్చియనుట) భక్తులను బరిపాలించుచుం డును కనుకనే ఈపెకు "రాధ" యను నామ మేర్పడిన దని ముఖ్యా భిప్రాయము. భక్తులను పరిపాలించునంతటి సమర్థత లలితాంబకే గలదు. అట్టిలలితాంబికయే రాధిక. ఇట్టి పర దేవతయగు రాధామహాదే విని జారిణియనియు కృష్ణునకు మేనత్త యనియు రుక్మిణికిఁ బరిచారిక యనియుఁ దూలనాడుట గడుంగడు పాప భూయిష్టమైన కార్యంబని యెఱుంగఁదగు.

మఱికొందఱు పండితంమన్యులు వల్లవీపల్లవుఁడగు
శ్రీకృష్ణుఁడు పరమేశ్వరుఁడా?

యని వచించుదురు. "కృష్ణ" యను యీ రెండక్కరములలో నెంత ప్రభావ మున్నదో యట్టివా రెఱింగియుండరని నాయభిప్రాయము.

శ్లో॥ కృషిర్భూవాచకశ్శబ్దో నశ్చానందవిధాయకః
సదానంద సమావేశః 'కృష్ణ' ఇత్యభిధీయతే॥
(బృహద్బ్రహ్మసంహిత)

ఇటులనే ఛాందోగ్యోపనిషత్తులు మొదలుగాఁగల యుపనిష త్తులలో గూడఁ జెప్పఁబడియున్నది. దీనంజేసి శ్రీకృష్ణపరబ్రహ్మము వేదాంతవేద్యుఁ డనియు పరాత్పరుఁ డనియు. బరమేశ్వరుఁ డనియు నెఱుంగఁదగు.

ఇంతియకాక బురాణదంపతులగు రాధాకృష్ణులకు భేద మించు కంతయైనను గనంబడదు. పెక్కులేల? కృష్ణుఁడే రాధ. రాధయే కృష్ణుఁడు. వీరిని వేఱుజేయఁ గడంగుట చంద్రునినుండి చంద్రికను వేఱుఁబఱచి నట్లుండును. శ్రీకృష్ణ పరమాత్మయె యిట్లు చెప్పెను.

శ్లో॥ అహంచ లలితా దేవీ రాధికా యాచగీయతే

* * * * * *

శ్లో॥ సత్యం యోషిత్స్వరూపాహం, యోషిచ్చాహం సనాతనీ
అహంచ లలితా దేవీ పుంరూపా కృష్ణవిగ్రహః
ఆవయో రంతరంనాస్తి, సత్యం సత్యం హి నారద.

(పద్మపురాణము నందలి డెబ్బదియేనవ యధ్యాయము.)

(తాత్పర్యము సుగమము)

కావున నిట్టి పవిత్రమైననాటకమును భక్తాగ్రేసరులును రాధా కృష్ణభక్తులును అమాత్యశేఖరులుననగు శ్రీయుత నంబూరు వీరభద్రశర్మ పాకయాజిగా రెంతయుఁ బరిశీలించి గ్రంథముద్రణమునకుఁ దగినంత సాయమొనరించి జగద్వంద్యులైరనుట కెంతయో సంతసిల్లుచుంటిని. వారికి నే నెంతయో కృతజ్ఞుఁడను. ఇట్టియపర రాధాకృష్ణులగు శ్రీ పాక యాజిగారి కాయురారోగ్యము లొసంగి రక్షించుగాకయని శ్రీ రాధా కృష్ణునకు వందనశతంబు లర్పించుచుంటిని.

మఱియు గ్రంథముద్రణమునకై వలయు ద్రవ్య మిడి కన్న కొమరితలకువలె నీ రాధికకుం బెండిలిఁగావించిన పవిత్ర చరిత్రయు దయాశాలినియు నగు శ్రీ రాజా చల్లయమ్మారావు బహద్దరు జమీం దారిణీగారి కెల్లప్పుడును గృతజ్ఞుఁడ నగుటయేగాక వారల కుటుంబము

నకును, వారికిని సంతతాయురారోగ్యము లిచ్చి పరిపాలించుగాక యని శ్రీ మద్రాధాకృష్ణుని నిత్యము ప్రార్థించుచుందును.

ఇంతియగాక, నీ నాటకమును సాదరమున నందుకొని పీఠిక వ్రాసియిచ్చిన విద్వద్వరిష్ఠులును అభినవాంధ్రవాల్మీకిబిరుదాంచితులును బ్రహ్మాండపురాణా ద్యనేకగ్రంథకర్తలును దయాస్వరూపులును నగు శ్రీయుత జనమంచి శేషాద్రిశర్మగారి కెంతయో కృతజ్ఞుఁడను.

వెండియుఁ గన్నపుత్రుని పగిది నింటభోజనమిడి నిశ్చింతగా విద్యాదాన మొనరించి నాకు మార్గదర్శకులై యిప్పు డీ నాటకమును సంస్కరించిన త్రిలోకవంద్యులును గింకపేంద్రఘటాపంచాన నేత్యాది బిరుదాంకితులును సుస్గురువర్యులును నగు శ్రీ వేంకటేశ్వరుల పాదపద్మములఁ గొలువఁజాలిన వివేకము నా కొసంగుగాక, యని రాధాకృష్ణులకు వందనశతంబు లర్పించుచు నిం దేమేనిదోషము లున్న సహృదయు లగు పండితులు నన్ను మన్నింతురుగాక యని విన్నవించుకొనుచు నీతొలిపలుకు నింతటితో ముగించుచున్నాఁడను.

శ్రీయుత జనమంచి శేషాద్రిశర్మగారి శ్రీ కృష్ణావతారతత్వము ఆరవభాగమున్నూ త్రిలింగలో ప్రచురించఁబడిన శ్రీయుత చిపుకుల వెంకటప్పయ్యశాస్త్రిగారి "శ్రీ రాధాకృష్ణులు" అనువ్యాసమున్నూ నా కీ తొలిపలుకునందు దోడ్పడిన వని మనవి.

శ్లో॥ కృష్ణ స్స్వయం బ్రహ్మపరం పురాణో
లీలా తదిచ్ఛా ప్రకృతి స్స్వమేవ
పరస్పరం సంధితవిగ్రహాభ్యాం
నమో యువాభ్యాం హరి రాధికాభ్యాం॥

ఇట్లు,

లక్ష్మీపురం,
విభవ భా. కృ. ౧౨ శుక్రవారం

రాధాకృష్ణ భక్తజనపాదరేణువు,
చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రి.

శ్రీ మత్పరదేవతాయై నమః.

# వరాన్వేషణ

(స్వవిషయము)



చ॥ అతులితభక్తి రాధిక య♦టంచును బేరిడి నాటకంబు సం
తతగురుపాదసేవ కత♦నన్ లభియించిన జ్ఞానవైభవో
న్నతి ముగియించి యెట్టెటులొ ♦ నవ్యవిలాసినినై చెలంగు మ
త్సుతయగు గావ్యకన్యకకు♦సుందరుఁడౌ వరుఁ గూర్పనెంచియున్.

చ॥ తిరిగితిఁ గొన్ని దేశములు ♦ దిమ్మరినై పలుబాధలొంది యె
వ్వరు దరిఁజేరి మన్నన ర♦వంతయు సల్పకయున్నఁ జింతచేఁ
గరము గృశించి కృష్ణు నెటు ♦ గాంతునటంచు భయంబుఁజెందితిన్
ధరణిని గూఁతులన్ గనెడు ♦ దండ్రులకష్టము నిట్టివేగదా!

శా॥ ఈరీతిన్ దగఁ గొన్నినాళ్లు జన నం♦తే భక్తిశ్రీచల్లయ
మ్మారా వంచు జగానఁ బేరువడి సం♦భావింప శశ్వన్మహా
దారశుభార్తిని నూజవీటి నల రా♦ధాకృష్ణ జన్మోత్సవం
బారూఢిన్ సలుపందొడంగి రనుచో♦య్యన్ వింటి వృత్తాంతమున్.

తే॥ గీ॥ ఎలమి నాకార్యమచ్చట ♦ ఫలముగాంచు
నంచు వెడలితి గొండంత ♦ యాసతోడఁ
గాల మొకరీతినుండదు ♦ గాదె నాదు
భాగ్యమంతకుమున్నె దా ♦ పయనమయ్యె.

ఇట్లు నూజివీటికరిగి అందు

మ॥ కనుగొంటిన్ దగ నాదు పుణ్యఫలసం♦స్కారంబునం జేసి స
జ్జన సాంగత్య ధురీణునిన్ బ్రవిమలా♦చారున్ యశోదారునిన్
గుణరత్నాకరు రాధికాచరణ స♦ద్గోష్ఠీరతున్ ధీరభ
ద్రినయప్రాభవయుక్తు నయ్యపర రా♦ధాకృష్ణునిన్ మంత్రినిన్.

సీ. ఏ ధన్యచారిత్రుఁ ♦ డింపుగా రాధికా
లోల దివ్యోత్సవ ♦ లోలుఁడయ్యె
నే సజ్జనుండు దా ♦ నెంతయు రాజకా
ర్యా పరతంత్రుఁడై ♦ రహిఁ జెలంగె
నే మంత్రిపుంగవుం ♦ డలమి బిడ్డలమాడ్కిఁ
బ్రజలఁ బాలింపఁ దో ♦ డ్పడుచునుండె
నే దయాపరుఁడు స ♦ త్కృప యాచకాళికిఁ
గల్పభూరుహ మగుచు ♦ గ్రాలుచుండె

తే॥ గీ॥ నట్టి నండూరు దివ్య వం ♦ శాబ్ధిపూర్ణ
చంద్రుఁడై మించి వెలుఁగొందు ♦ సరస సుగుణ
మణిని శ్రీ వీరభద్రయా ♦ మాత్యవరుని
కరము దర్శించి నాకార్య ♦ మెరుకఁ బఱుప.

వ॥ ఇట్లు

చ॥ అనుటయు 'వల్లె' యంచు సము ♦ దంచితరీతి వచించి యంత న
య్యనఘుఁడు వెంటఁదోడ్కొని ర ♦ యంబున నేగెను చల్లయమ్మ రా
వనుపమ భక్తి మాధవు స ♦ మాదరణంబునఁ బూజసేయు స
న్మణి గృహరాజ రాజిత స ♦ మంచితమంటప మున్నచోటికిన్.

వ॥ అట్టియెడ,

సీ॥ ఒకచోట గాయక ♦ ప్రకరంబు మధుర సం
గీతంబు బాడి స ♦ త్కృతిఁ జెలంగ
నొకచోట భూసుర ♦ నికరంబు వేద పా
రాయణంబొనరించి ♦ రక్తిమీర
నొకప్రక్క భాగవ ♦ తోత్తము లోలి సద్భక్తిఁ
జెలఁగుచుఁ బాసుర ♦ [illegible]ందులిడఁగ
నొకమూల భక్తుల ♦ త్యున్నతి గీర్తించి
లీలాశుకులయట్లు ♦ నోలలాడఁ

తే॥ గీ॥ బ్రకటతర వైభవస్ఫూర్తిఁ ♦ బరిఢవిల్లు
రాధికామాధవుని మందిరంబుచెంత
కరిగి మాధవున కెరగి ♦ యంచితోక్తి
నిట్టులాడితి వినయోక్తి ♦ నెలమి ఎనఁగ.

చ॥ అరయఁ బవిత్రమై శుభద♦మై ధరణీ పరిపాల బృంద బం
ధురమయి నృత్యగీతచయ ♦ దుందుభినాద వినోదమై మహా
దరయుతమై మహీసురవి♦తానజయప్రకరాంచితంబు నై
పరగి ముదావహం బగు స♦భాస్థలిఁ గాంచితి మోదమందితిన్.

వ॥ అనియిట్లు సభాస్థలి వర్ణించి సకలరాజ పురోహిత మంత్రి బాంధవ వివిధ పరివారయుతంబును విద్వజ్జనగాయక రాసక్రీడాకార్య కరణధురీణ ప్రముఖ సరసాష్టపదీ గాన రసజ్ఞశిఖామణిప్రకర భూయిష్టంబును నగు సభాస్థలిదిక్కు మొగంబై పరిచారికానికర సంసేవితయై చెలువొందు లోకమాత యనంబడు ప్రభ్వి నిండు పేరోలగంబున విలసిల్లుచుండ వినయోక్తుల సభవారిని రంజిల్లఁజేయుచు నిట్టులలికితి. "తల్లీ! మీరలిట్టి రాధాకృష్ణ జన్మోత్సవాది పుణ్యకార్యంబులఁ బ్రవర్తిల్లుటయే కాక మఱియును;

చ॥ అనుపమ సద్గుణోత్తరుఁ డు♦దంచితకీర్తియుతుండు నీతివా
క్యనిపుణుఁ డార్యవర్యుఁడు ద♦యాపరతంత్రుఁడు రాజకార్య క
ల్పనవిభవాభిరాముఁడయి ♦ భద్రకరుండగు వీరభద్ర స
జ్జనుఁడు ప్రధానిగాఁగ ననుజన్ముఁడు నల్లుఁడుఁ దోడుగాఁగ నీ
వనయము రాజ్యమేలుదు గ♦దమ్మ కొఱంతలు లేక నిచ్చలున్.

వ॥ వెండియు,

తే॥ గీ॥ పెరిమ నిర్వురు కూతుల ♦ పెండ్లిఁజేసి
ముదము నొందితి రమ్మ యి♦ప్పుడు మదీయ
కన్యకకు బెండిలింజేయ♦గడఁగి మంత్రి
తగిన సంబంధ మరసెనో ♦ తల్లి! కనుక.

చ॥ పలుకు లికేల? 'రాధ'యను ♦ బాలికఁ బెంచియుఁ బెద్దజేసి నేఁ
డలఘుమతిన్ భవత్సదన♦ముందున మాధవుఁడ న్వరుండు ని
శ్చలమతి నున్నవాఁడని వి♦చారణసల్పియు వచ్చినాఁడ న
మ్మ లలితమొప్ప మూఁడవకు♦మారికిఁ బెండిలిఁ జేయుఁ డియ్యెడన్.

చ॥ అనివచియింప సభ్యులహా♦హా! సెహబాసను మోదసూచకం
బును వెలిఁబుచ్చ రాజ్ఞియును ♦ ముచ్చటఁదీరఁగ నాదు రాధికా
మణిఁదగఁగొంచు గౌరికడ ♦ మంచి ముహూర్తమునందుఁ బెండిలిన్
దనయకు సల్పినట్లు య♦థావిధిసల్పిరి *కట్నమిచ్చుచున్.

---

*నాటకము ముద్రణకై వలయు ద్రవ్యమొసంగిరనుట.

శ్రీమత్పరదేవతాయై నమః.

# ఆశీస్సు

శా॥ శ్రీరంజిల్ల మయూరపింఛము దలన్
జెల్వొంద నొయ్యారముల్
మీరన్, వంశము మోవియం దమర; నెం
తే ముద్దులన్ గుల్కు రా
ధా! రమ్మా! కరుణింపుమా! యనెడు రా
ధాకృష్ణుఁ డీ చల్లయ
మ్మారావున్ గృపఁ జూచుతన్ వరద
రాడ్ క్ష్మానాథు నర్థాంగినిన్.

సీ॥ ఏ ధన్య, రాధికా ♦ మాధవచరణార
విందసందర్శనా♦నంద మందు
నే తల్లి సత్కృపా♦మృతవృష్టిఁ బ్రజలను
గన్నబిడ్డలమాడ్కిఁ♦గాచుచుండు
నే లోకమాన్య రా♦ధాలోలదివ్యోత్స
వము లొనర్చుచు భక్తి♦వార్ధిఁ దేలు
నే యమ్మ దీనుల♦నెంతయుఁ బెరిమతోఁ
గరుణింప దానకం♦కణముఁ దాల్చె

తే॥ గీ॥ నట్టి పూతచరిత్రి ద♦యాసమేత
మాత చారు లసద్గుణో♦పేత చల్ల
యమ్మరావు మహారాజ్ఞి ♦ నతుల దయను
నేలుఁగావుత రాధికా♦లోలుఁ డెపుడు.

---

శ్రీమదిష్టదేవతాయై నమః

ఏతద్గ్రంథపోషణకర్త్రి యగు

గన్నవరం యెస్టేటు జమీందారిణీగారైన

# శ్రీ రాజా చల్లయ్యమ్మారావు బహద్దర్

## జ మీం దా రి ణీ గా రి వం శా వ ళి.

చ॥ సురుచిరమందిర ప్రకర • శోభితమై పికపంక్తి నాద సం
భరిత రసాల భూరుహావి ♦ భాసితమై ధరణీ ధవోత్కర
స్థిరతర కీర్తియుక్తమయి ♦ శ్రీసతిరమ్యవిహార యోగ్యమై
ధరణిని నూజవీట్పురవ ♦ తంసము భాసిలు సారవంతమై.

వ॥ అందు,

మ॥ రవిసందీప్తుఁడు రావువంశమణి నా ♦ రయ్యప్పరాయక్షితీ
ధవుఁ డభ్యంచిత సద్గుణోత్తగుఁడు వి ♦ ద్యాబుద్ధిసంపన్నుఁ డా
ర్యవరుం డాతతకీర్తి లక్ష్మినరస ♦ య్యమ్మాంబికా నాథుఁడై
భువి నొప్పారు రమాధినాథుఁ డగు నం ♦ భోజాక్షుఁడీతం డనన్.

మ॥ కమలాక్షుండు బయోనిధిన్ గనఁగఁ ద ♦ క్రింబందె ముక్కంటి వా
సము వీక్షింపఁ ద్రినేత్రముల్ దెరచె హం ♦ సన్ గాంచఁగన్ ధాత క్షీ
రము నీరంబునఁ జేర్చె నవ్విభుయశో ♦ రత్నంబు దీపించి స
ర్వము దానై విలసిల్లి పాండిమ వహిం ♦ పన్ విస్మయం బందుచున్.

సీ॥ అమ్మహీనాథున ♦ కాత్మజులై మువ్వు
రుదయించిరి త్రిమూర్తు ♦ లో యనంగ
నందు బెద్దకొమారు ♦ లై మించు రాజగో
పాల భూపాలుఁడు ♦ బఱఁగె భూరి
కీర్తి సంపన్నుఁడై ♦ కీర్తింప రెండవ
తనయుఁడౌ రామచం ♦ ద్రక్షితీంద్రుఁ

డరుదార సద్గుణో ♦ త్తరుఁడౌచు జెలువొందె
బ్రజలెల్ల బళిర మ॰హాత్మ యనంగ
తే॥ గీ॥ నందు మూఁడవపట్టి యై ♦ యలరునట్టి
వరదరాజక్షితీతలే ♦ శ్వరుఁ డుదార
గుణగణోపేతుఁడై తన్నుఁ ♦ గొలుచు జనుల
కమిత ముద మిచ్చుచును రాజ్య ♦ మందె నపుడు.
తే॥ గీ॥ ప్రకటదుర్వార గర్వ సం ♦ భరితఘోర
శాత్రవానీక పవన భు ♦ జంగుఁ డైన
వరదరాజప్పరాయ భూ ♦ వరుఁడు వార్ధి
రశనయగు భూమిరమణికి ♦ రమణుఁడయ్యె.
సీ॥ గుణగణోపేతయై ♦ తనరు నేసాధ్వికి
గారాబుతండ్రి రం♦గయ్య గారు
ఆశాంతకీర్తి వి♦శ్రాంతయౌ నేయమ్మ
కలరినతల్లి ల♦క్ష్మమ్మగారు
ఏ పవిత్రచరిత్ర ♦ కెలమి సోదర్యుండు
రహిఁ శ్రీజగన్నాథ♦రావుగారు
ఏ తల్లి కెనయౌచు ♦ నింపారు వేంకట
వరదరాట్పృథ్వీశు♦వరశుభాంగి
తే॥ గీ॥ యైచెలంగెడి శ్రీ చిన్న ♦ యమ్మరావు
జెలియ లయ్యెనో యట్టి ధీ♦లలిత చల్ల
యమ్మరావు మహారాజ్ఞి ♦ నతిముదమునఁ
బరిణయంబాడి చెలువొంది ♦ పరగె ఘనుఁడు.
ఉ॥ ఇవ్విధిఁ బెండ్లియాడి మది♦ నెంతయు సంతసమంద బందుగుల్
జవ్వనమందు రాజ్య సుఖ♦లాలసుఁడై ప్రజలెల్ల మెచ్చున
ట్లవ్విభుఁ డేలె రాజ్యము న♦యంబున నిర్వురుగూఁతులన్, మదిన్
నివ్వటిలంగఁ బ్రేమ ధర♦ణీధవుఁ డప్పుడు గాంచె నొయ్యనన్.

తే॥ గీ॥ ఇటుల నిర్వురు బిడ్డల ♦ నెలమిఁ బడసి
కరము దళుకొత్త శ్రీలక్ష్మి♦నరసయమ్మ
రా వసంగను సుబ్బయ♦మ్మాత్రి వసంగ
బేరులన్ బెట్టి వేర్వేరఁ ♦బిలుచుచుండ.

వ॥ అంత,

మ॥ పెరిమన్ ముద్దుకుమారికామణులకున్ ♦ బెండ్లిండ్లు జేయన్ వసుం
ధర వెల్లంకికులాబ్ధిచంద్రుఁడు జగ♦న్నాథాఖ్య భూనాథుఁడే
నరు డంచున్ మది మెచ్చి బంధుగులు సం♦భావింప జ్యేష్ఠాత్మజన్
గర మానాథున కిచ్చి పెండిలి దగన్ ♦గావించి మోదంబునన్.

వ॥ అంత,

మ॥ చనియెన్ గొన్నిదినంబు లాదట నుదం♦చత్కీర్తి సంపన్నుఁడున్
ఘనచారిత్రుఁడు వైరిభీకరుఁడు వి♦జ్ఞానప్రపూర్ణాత్ముఁడై
యనఘుండై చెలువొందు శ్రీ వరద రా♦జాధీశచంద్రుండు నో
య్యన స్వర్లోకనివాసియై విబుధరా♦జ్యం బప్డుపాలింపఁగన్.

వ॥ అట్టియెడ,

శా॥ ధీరస్వాంతయు నౌచు దైవ గురుభ♦క్తిన్ మించి విఖ్యాత స
చ్చారిత్ర ప్రభవ ప్రకర్ష విమలాం♦చత్కీర్తి సంపన్నయై
కారుణ్యామృతవృష్టిఁ జిల్కఁ బ్రజలన్ ♦ గాపాడుచున్ జల్లయ
మ్మారా వంచు జగానఁ బేరువడసెన్ ♦ మాన్య ప్రతిష్ఠోన్నతిన్.

మ॥ పరగన్ రెండవముద్దుపట్టి యగు సు♦బ్బయ్యమ్మరావున్ బురం
దరతుల్యుం డగు కందిమళ్ల కులర♦త్నం బంచుఁ బేరొందు సుం
దరుఁడై సద్గుణమూర్తియో యనెడు సీ♦తారామ భూనేతకున్
ధర దేవేరిగఁజేసి సౌఖ్యమును మో♦దంబందఁగన్ నిచ్చలున్.

సీ॥ ఒకవంక పరిచార♦నికరంబు చెలువొంద
నొకవంకఁ జేటిక ♦ లుల్లసిల్ల
నొకవంక మంత్రు ల♦భ్యున్నతిఁ జెలువొందఁ
నొకవంక సేవకుల్ ♦ బ్రకట మొప్ప
నొకవంక రథగజ ♦ ప్రకరంబు విలసిల్ల
నొకవంక తురగంబు ♦ లొప్పమీర
నొకవంక సత్పండి♦తోత్తముల్ భాసిల్ల
నొకవంక పౌరాణి ♦ కోత్తములలర

తే॥ గీ॥ సకలయాచక బాంధవ♦సమితితోడ
మించి దీపించి ప్రజలచే ♦ మెప్పువడసి
కూఁతు రల్లుండ్రతోఁ దూఁగి ♦ నీతిఁ జల్ల
యమ్మరావు మహారాజ్ఞి ♦ యతిశయిల్లె.

శ్రీ శ్రీ శ్రీ



# పండితాభిప్రాయములు

*మచ్ఛ్రేయోభిలాషులును గురువర్యులును నగు జంధ్యాల శివన్న శాస్త్రిగా రిట్లు వ్రాయుచున్నారు.

చిరంజీవి చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిచే రచింపఁ బడిన "కళ్యాణ రాధా మాధవము" అను నాటకమును ఆమూలాగ్రము చదివి చూచితిని. తేనెలొలుకు చక్కని శైలియు ప్రతిభా నిదర్శక మగు కథా చమత్కృతియు, పాత్రౌచితియుఁ గలిగి మిక్కిలి హృదయంగమముగ నున్నది. ప్రథమ ప్రయత్నమే ఏతాదృశగుణశోభిత మగుట నీ గ్రంథకర్త ముందుముందు నిరోధిక ప్రతిభాపరిచాయకము లగు మౌలిక గ్రంథములను రచించి మాతృభాషకు గొప్ప సేవ చేయునని దృఢవిశ్వాసము గల్గుచున్నది. ఈశ్వరుఁ డందులకు తగిన ఆయురారోగ్యాదుల నొసఁగుగాత మని ప్రార్థించుచున్నాను.

గుడివాడ,
భాద్ర. కృ ౧౪ శుక్రవారము. } జంధ్యాల శివన్న శాస్త్రి.

ఈనాటకమును సాదరమున నందుకొని మద్గురు వర్యు లీ యభిప్రాయము నిట్లు వ్రాసిపంపిరి.

## రాధిక

అను నీ తెలుఁగునాటకము చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిచే రచింపఁబడినది. ఇందు కథాసంవిధానము చాల చమత్కృతిగా సంఘటింపఁబడినది. దానికిఁదోడు రచన మృదుమధురపద భూయిష్ఠమై నిర్దుష్టమై ప్రస్తుత గ్రంథమునందలి శృంగారరసమును సర్వవిధములఁ బోధించునదిగా నున్నది. గ్రంథకర్త కిది ప్రథమ ప్రయత్నమైనను కవిత్వ మారితేఱిన విధముగనే యున్నది గాని కుంటువడుటలేదు. ఇది నేను ప్రత్యక్షరమును విని యిచ్చిన యభిప్రాయము.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి,
శతవధాని.

---

* ప్రేమతో నీనాటకమును జూచి తొలుత సంస్కరించిన విద్వద్వరిష్ఠులును ఉభయభాషాకోవిదులును విశేషించి మద్గురూత్తములు నగు జంధ్యాల శివన్నశాస్త్రి గారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడ నగుటకు సంతసిల్లుచుంటిని.

# ఉపోద్ఘాతము.

## కళ్యాణ రాధామాధవము.

ఇదొక నాటకము. ఐదంకములు గలది. ఇందు రాధాదేవికిఁ
బతియందుఁగల భక్త్యనురాగములు సర్వతోముఖముల వర్ణింపఁ
బడినవి. ఈపవిత్రనాటకమునకు నుపోద్ఘాతము వ్రాయు భాగ్యము
నాయట్టి యల్పమతి కొదవింప నెంచి కాఁబోలు కవివరేణ్యులు తామే
నాగృహమున కరుదెంచి నాటకము నిచ్చి చెన్నపురికి దయచేసిరి.
శ్రీకృష్ణావతారతత్త్వమును వ్రాయుచుఁ గొన్ని పురాణములను బఠించి
రాధామహిమమునఁ గోట్యంశాంశము నెఱిఁగితి ననుకొనుచున్న
వాఁడ గావున భక్తితో నాటకమును గైకొని యిడికొని ఇతి శీఘ్రగాఁ
బఠించితిని. పరమానందకందళిత హృదయుఁడ నైతిని. రాధామాధ
వుల సేవింప నిది యొకమార్గము కాఁబోలు నని తోఁచెను. మూలనున్న
నాకిది యొక యదృష్ట మనియు నొక తలంపు కలిగెను.

ఈనాటకమునఁ బ్రధానముగా రాధాదేవికి శ్రీహరియందుఁ
గల భక్త్యనురాగ విశేషములు స్పష్టము లగునట్లు కవి వ్రాసెను.
కథయంతయుఁ బురాణస్థమేయైనను నాటకకర్తలకుం గల స్వాతం
త్ర్యము నుపయోగించి గ్రంథకర్త మార్పులు గావించెను. రాధికకు
భక్తితాత్పర్యములు శ్రీకృష్ణమూర్తియందు నైసర్గికము లనుట కవిభా
వమైనట్లు కనుపట్టు. ఎంతయు నిది మెచ్చఁదగు విషయము. రాధికను
రంగమండప ప్రవేశము చేయించినది మొదలామె నిర్మలాంతఃకరణ
మున శ్రీహరిని ధ్యానించునట్లే వ్రాయంబడి యుండుట యీభావము
నకు మూలాధారము. సత్యభామకుంగల సౌందర్యగర్వమును గవి
యందందు సమయానుకూలముగఁ బోషించెను. రాధికకు భగవంతు
నందుఁగల యవ్యాజప్రేమమును దృఢపఱచుటకే యామెతండ్రి
యగు వృషభానునకుఁ గృష్ణునియం దించుక యసూయ యున్నట్లు కవి
కల్పించెను. ఆతని కట్లున్నను లేకున్నను గవిభావ మీవిషయమును

దెలుపుటకే యని పాఠకు లూహింపక మానరని నా నమ్మకము. ద్వితీయాంకమున సత్యభామ ప్రాణసఖితో సంభాషించుట సమయానుసారముగ నుండుటయేగాక కామినీసహజముగ నున్నది. అందుగల పద్యముల భావము పై యర్థమును జక్కఁగా బోషింపఁజాలియున్నది. ఆ యంకమునందే సత్యభామ సాయంసమయమున భృంగమును దిలకించి వ్యంగ్యముగాఁ బలికినట్లు పద్యములు వ్రాయఁబడినవి. మిక్కిలి చక్కగనున్నవి కాని, భృంగపంచకమను పద్యరత్నముల భావము మదినిడుకొని వీనిని గవి వ్రాసె నని కొందఱకుఁ దోఁపవచ్చును. కాని యది న్యాయముకాదు. ఈపద్యముల భావము యుక్తియుక్తముగ నున్నది. నాల్గవయంకమున సత్యారాధలను బ్రవేశపెట్టుట యందు రాధికకుంగల భక్తిరసమును వెల్లడించుట మెచ్చదగు విషయము. చచ్చు శృంగారమును బోషించుట యీకాలపుఁ గవులలోఁ గొందఱకు సహజమై యుండ నట్టి నీరసభావమును వీడి యి క్కవి కృతార్థుఁడయ్యెను. పంచమాంకమున శ్రీకృష్ణుఁడు స్త్రీవేషమూని రాధికతో సంభాషించునట్లు కల్పింపఁబడినది. రాధికకుఁ దనయందుఁ గల విశ్వాస మెట్టిదో పరీక్షింపఁగోరి శ్రీగోపాలబాలుఁ డామెచే నామె పూతచరిత్రమును లోకులకుం దెలుపఁ బూనె నని తోఁపఁజేయుటకే కవి ప్రయత్నమని పొడకట్టెడిని. ఇట్లు కల్పించుట సామాజికులకే కాక శ్రీకృష్ణభక్తులకెల్ల మహత్తర ప్రమోదదాయకముగా నుండు ననుట కేసందియములు నుండవు. మొత్తముమీఁద నీనాటకకల్పన మతిరమణీయ మనక తప్పదు.

ఈనాటకమున ననవసరముగాఁ బాత్రప్రవేశము చేయింపఁబడలేదు. అందందుఁగల పద్యములు కడుంగడు హృద్యములు. రసమును గురిపించుచున్నవి. చతుర్థాంకమునం దొక్క పద్యమున రేఫద్వయమైత్రి యొనఁగూర్పఁబడినది. కవిభావమేమో తెలిఁయజాలకున్నాఁడను. వలయునని యేమైనఁ బెక్కుతావుల నది కానరాదు.

శ్లో॥ మాధుర్య్యవ్యంజకై ర్వర్ణై రచనా లలితాత్మికా।
అవృత్తిరల్పవృత్తిర్వా వైదర్భీ రీతి రిష్యతే॥

అని సాహిత్యదర్పణానుసార మీ నాటకమున నెల్ల తావుల వైదర్భీరీతియే కానంబడునట్లు కవి ప్రయత్నించి వ్రాసె ననుట స్పష్టము. ఇట్టి విషయముల నింకను బెంచి వ్రాయక ఋచ్చునకుఁ గొలఁది పద్యముల నుదాహరించెదను.

సీ॥ మోదమందుచు సర్ప ♦ షులు తలల్పైకెత్తి
మురళిఁ బూరించు నా ♦ ముద్దుకృష్ణుఁ
దన కేల మునికోలఁ ♦ గొని యాలమందలఁ
దోలు నాచిన్ని గో ♦ పాలకృష్ణు
నెమ్మోము దమ్మిపై ♦ గ్రిమ్మిన భ్రమరంబు
లన ముంగురుల నొప్పు ♦ ననఘుఁ గృష్ణుఁ
నిండు వెన్నెలకాంతి ♦ నిరసింపఁగాఁ జాలు
చిఱునవ్వు లొలుకు నా ♦ చిన్నికృష్ణుఁ

తే॥ గరముదఘుకొత్త మాళి సుం ♦ దర మయూర
పింఛమును దాల్చి కనులకు ♦ విందొనర్చు
రాధికా చిత్తపద్మచ ♦ రన్మధువ్రి
తమును గనియున్నఁ జెప్పరా ♦ దా లతాంగి.

— (ప్రథమాంకము)

ఇందు మునికోలయను పదము ధేనువులకు భయమును గలిగించునది యని నాభావము. కష్టార్థముగాన బాధకములే దని సమాధానము వచ్చునని యెఱుంగుదును. ఈపద్యమంతయు వైదర్భీరీతి కుదాహరణ మనక తప్పదు. మనోహరముగ నర్థము పొడకట్టుచున్నది.

శా॥ ఆలేనవ్వులసొంపు లామృదుపద ♦ న్యాసంబు లావిభ్రమం
బాలీలాస్పద వాగ్విలాసగరిమం ♦ బా చెల్వ మా ప్రాయ మా

వాలుంగన్నుల చూపు లామెఱపుఁ దీ♦వంబోనిమై చాయ నా
పాలుంగారెడి మోముపై ఖరిని జె♦ప్పన్నే ర్తునే మిత్రమా!

(౨ అంకము.)

అని కృష్ణుఁడు విదూషకునితోఁ జెప్పిన ట్లున్నది. దీని చమత్కృతిని బెంచివ్రాయనేల? మిక్కిలి చక్కఁగా నున్నది.

శా॥ ఓ దైత్యాంతక! యో కృపాజలనిధీ! ♦ యోభక్తకల్పద్రుమా!
యో దామోదర! యో త్రిలోకభరణా! ♦ యో సత్యనిత్యాకృతీ!
యోదక్షాధ్వరవైరిపూజితపదా! ♦ యో విశ్వనిర్మాణ! దే
వా! దీనావన! నన్నుగావుమిఁక నా♦థా! దివ్యసంపత్ప్రదా!

(౩ అంకము.)

అని రాధిక పల్కెను. ఇందుఁ దొలుత దైత్యాంతక యను విశేషణము భగవంతుని కర్పింపఁబడినది. రాధిక భావ మేమనఁగా భూభారభూతు లగు క్రూరరాక్షసుల నడంచుటకే పరమేశ్వరుఁడు మానవాకృతిం దాల్చినా డనుభావము లోకులకుం దెలుపుటయే. తాను మూలప్రకృతి. శ్రీకృష్ణుఁడు విరాట్టు. అని మనము గ్రహింపవలయును.

సీ॥ సలలితబాలర♦సాలపల్లవ ఖాది
యగు పికంబొల్ల దా♦హార మరయఁ
బరికింపఁ గలకల♦స్వనమెల్ల విడనాడి
విలపింపఁదొడఁగె నీ ♦ వెఱ్ఱిచిలుక
గమనలాలిత్యమా♦కలహంసిక దొఱంగి
జడతవహించె నా♦శ్చర్యమొంద
నిలచినచోటనే♦నిలిచి చూచుచునుండె
జకితమై లేడి గ్రా♦సంబుమాని
తే॥ కమ్మపూఁదేనియలుగ్రోలి ♦ ఝు మ్మటంచుఁ
బాటఁ బాడెడి నీమొల ♦ దేఁటిపాటఁ

బాఁడుటను మాని నీవిట్లు ♦ పరఁగుచుంట
వీఁడు మీఁకనైన దుఃఖంబు ♦ వెట్టెడాన !

(౪ అంకము.)

ఇట్టి పద్యరత్నముల నెన్నింటినైన జూపవచ్చును. సాధుమతి నాలోచింప నీనాటకము రసమయముగా నున్న దనవలసిన దే. కేవల శృంగారరసప్రధానముగా వ్రాయక కవి భక్తి శృంగారముల సమాన ముగాఁ గనఁబఱచుచు వ్రాయుట యెంతయుఁ గొనియాడదగినది. ఇట్టి యుత్తమనాటకమును వ్రాసి యీ కవితల్లజుఁడు కృతకృత్యుఁడై "సమానానా ముత్తమ శ్లోకోఅస్తు" అన్నసూక్తికి నుదాహరణ భూతుఁడయ్యెను. ఇంకను దీనింగూర్చి విశేషములు వ్రాయఁదగినవి పెక్కులు గలవు. నాటకమునకన్న నుపోద్ఘాతమే పెద్దదగునేమో యను భీతి మానితిని.

శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు సుజనవిధేయుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

———

శ్రీ మత్పరదేవతాయై నమః

# శ్రీ కల్యాణ రాధా మాధవము



## ఈ నాటకమందు వచ్చు పాత్రలు.

### పురుషులు

సూత్రధారుఁడు

శ్రీకృష్ణుఁడు—కథానాయకుఁడు

నందుఁడు—కృష్ణుని తండ్రి

వృషభానుఁడు—రాధ తండ్రి

మైత్రేయుఁడు—కృష్ణుని వేడుక చెలికాడు

బ్రహ్మదేవుఁడు—రాధామాధవ సంధానకర్త

### స్త్రీలు

రాధ—కథానాయిక

సత్యభామ—కృష్ణుని భార్య

నిపుణిక—రాధ చెలికత్తె

పద్మిని—సత్యభామ చెలికత్తె

కమల—సత్యభామ పరిచారిక

☞ N. B :- ఇంక వ్రజసుందరి మొదలుగాగలవారు వత్తురు.



శ్రీ మత్పరదేవతాయైనమః.

# కృతిసమర్పణము



శా॥ గాథల్ పెక్కు రచింపఁజాలను జగత్కల్యాణ సంధాయకుల్!
రాధామాధవులార! తావక కృపాప్రావీణ్యముఁ బొల్చు నీ
రాధామాధవ రూపకంబును మదిన్ రంజిల్ల నర్పించు ద
త్స్వైరధన్ దాసుని నన్నుఁ గావుఁడిఁకఁ బేర్మిన్ భద్రముల్ గూర్చుచున్.

లక్ష్మీపురం,
విభవ, భాద్రపద
బ ౧౪ శుక్రవారము.

ఇట్లు,
భవద్భక్త జనపాదరేణువు,
చల్లా లక్ష్మీనారాయణుఁడు



శ్రీమత్పర దేవతాయై నమః.

శ్రీ

# కల్యాణరాధామాధవము

## నాంది

శా॥ *శ్రీమద్భానుకుమారికో పులిన సచ్ఛ్రేణీవిహారోద్ధతిన్
భామారత్నము కోపమూని చనఁ దత్పాదాంకమందున్ బదం
బామోదోన్నతి నుంచి వెంటఁజని రాధా! నీ భుజావల్లరిన్
బ్రేమన్ గట్టుమటంచుఁ గౌఁగిలిడు శ్రీకృష్ణుండు మిమ్మోముతన్.

ఉ॥ పాయనిప్రేమ శౌరి కనపాయినియై ముదమంది రాధ;—"నా
థా!"యనిభక్తియుక్తి యమునాంతర భూములసంచరింప;—"రా
ధా!" యని కృష్ణుఁడంత సముదంచిత ప్రేమఁ జరింప ధాత;—"వ
హ్వా!" యని వేడ్కసల్పిన వివాహము మీకుశుభంబు లిచ్చుతన్.

(నాంద్యంతమున పుష్పాంజలిఁ జల్లి)

సూత్ర:—(తెరవంక జూచి) ఓసీ! ఇంక నాలస్య మెందులకు? నీ యలంకారమింతటితో ముగించిన పక్షమున నొక మాటిటురమ్ము.

నటి:-(తొందరతో ప్రవేశించి)ఆర్యా! ఇదిగో వచ్చితిని. అనుజ్ఞ యేమి?

సూత్ర:—ఓసీ! అటుచూడుము. సభ యంతయుఁ బండిత బృందముతో నిండి మన యాలస్యమున కెంత విసుఁవు జెందుచున్నదో?

నటి:—అగును. ఇప్పు డేమి చేయుదము?

సూత్ర:—ఏదియో వినోదమున నీసభ నిప్పుడు రంజింపఁ జేయ వలయునుగదా?

* యమునానది

నటి:—అయిన సర్వసమర్థులరగు మీరలే దీని విషయము నాలో చింపవలసి యుండును.

సూత్రి:—(విచారించి) కల్యాణీ! వినుము. ఇపుడు క్రొత్తగా రచియింపఁబడిన "కళ్యాణరాధామాధవ" మను నాటకమును బ్రయోగింపఁ దలచితిని. సమ్మతింతువా?

నటి:—ఏమీ! కల్యాణరాధామాధవమా?

సూత్రి:—అగును.

నటి:—(చప్పరించి) ఇట్టి వెన్నియో నాటకములు వెలువడుచున్నవి. ఇం కొకటి సెలవీయుఁడు.

సూత్రి:—ఏ మట్లు తృణీకరించితివి? ఎట్టివారి నను రసమును గ్రహింపని పక్షమున నిరసించుటఁ దగదు.

నటి:—పోనిండు ఇ క్కవినామాక్షరము లెవ్వి?

సూత్రి:—(స్మృతి నభినయించి) మఱచితిని. కవి యనిన తోడనే స్మృతికి వచ్చినది. ఇ క్కవియే సభవారితో నిట్లు వినయ పూర్వకముగ విన్నవించుమనిన విషయ మెరింగించిన పిదప నీసందియము దీర్చెద.

నటి:—అట్టులే కానిండు.

సూత్రి:—(సభవంకకుఁ దిరిగి) పవిత్ర చరిత్రులైన యో సభాసదులారా! ఈ కవియే మీతో నిట్లువిన్నవించుకొనుచున్నాఁడు.

తే॥ గీ॥ తప్పటడుఁగులు వైచు నందనునిఁ జేరి
తండ్రి, చేయూత నొసఁగు చందమున బాలుఁ
డ నగు నాయొప్పు లెంచఁ దొడంగు డంచ
నీరము దొలంగి క్షీరంబు గోరినటుల.

ఏది యెట్లులున్నను,

ఉ॥ అంచితులైన పండితు 'లహో' యని మెచ్చినఁ జాలు భూమి జ
న్మించినవారిలో నొకఁడు మేటి యనందగువాఁ డెవండు? బా
గంచుఁ దలంతురే కుజను "లందరినిం దనియింప మమ్ము ని
ర్మించిన బ్రహ్మకైనఁదరమే" యని మాగురువుల్ వచింపరే!

నటి:—నాథా! ఇ క్కవి "మా గురువుల్ వచింపరే" యని కదా పలికెను. ఇతని గురువు లెవ్వరు?

సూత్రి:—(నవ్వి) వెఱ్ఱిదానా! ఇంత యనభిజ్ఞవై తివేమి? "కింకవీంద్ర ఘటా పంచానన బాలసరస్వతీ" త్యాది బిరుదాంచితులై తమ కీర్తి ప్రతాపంబులు ప్రపంచ మెల్లెడల వ్యాపింప; సూర్య చంద్రులో యనెడు భ్రాంతిఁ గొలుపఁ జాలిన నాటక కర్త లగు విద్వత్కవి పుంగవులైన తిరుపతి వేంకటకవులు.

నటి:—(ఆశ్చర్యముతో) ఓహో! అటులనా! (అని కొంచెమూరకుండి పెదిమ విఱచి) ఏమి కవులులెండు; ఏవియో కొన్ని పదములు సంతరించుకొని కవులమని పేరిడుకొని "మేమును దిరుపతి వేంకటకవుల శిష్యుల"మని చెప్పుకొను దురాచారము మన యాధునిక కవులలోఁ జాలవఱకుఁ బ్రబలినది.

సూత్రి:—కల్యాణీ! నిజమే పలికితివి. కాని ఈతఁ డట్టివాఁడు గాఁడు. (స్మృతి నభినయించి) మఱచితిని. ఇట్టి దురూహ కలుగునని కాఁబోలు నీకవియే నాకిట్లు జెప్పెను.

నటి:—ఎట్లు?

సూత్రి:—ఇదిగో వినుము.

చ॥ "అరయఁగఁ బాణినీయమున ♦ మగ్రము నధ్యయనం బొనర్చి సుం
దరతర సాహితీపటిమ ♦ నాటకముల్ రచియింప లక్షణో
త్కరముల నేర్చినాఁడ" వని ♦ తద్దయు దేశికులైన "వేంకటే
శ్వరులు" వచింపరే వినయ ♦ సంపద మెచ్చిన శిష్యుఁ డంచుఁ గాఁ.

నటి:—సరియె కాని, ఇంతకును గవినామమేదియో గ్రామ మెయ్యదియో తెలియకున్నది.

సూత్రి:—(స్మృతి నభినయించి) మఱచితిని; వినుము.

సీ. శ్రీరమా రమణికి ♦ సిందూరతిలకమై
చెన్ను వహించు ల♦క్ష్మీశ పురంబు
నిరతాన్నదాన స♦న్నిష్ఠాగరిష్ఠులఁ
జెలువొందు నట్టి ల♦క్ష్మీశపురంబు
స్నాన సంధ్యా ద్యను♦ష్ఠాన సత్కర్మల
దీపించి మించు ల♦క్ష్మీశపురంబు
వేదశాస్త్రాధ్యయ♦నాది సద్విధులకుఁ
గాపురంబైన ల♦క్ష్మీశపురంబు

తే॥ గీ॥ అట్టి పురమందు "చల్లా" భిధాన్వయాబ్ధి
పూర్ణరాకాశశాంకుఁడై పొల్చి "లక్ష్మి
నరసమాంబ"కు "సీతయ" నామధేయు
నకును జ్యేష్ఠ తనూభవుండై చెలంగి.

ఉ॥ శ్రీయుత "చల్లపిళ్ళ" కుల సింధు సుధాకరు వేంకటేశ్వరుఁ
బాయక కొల్చి; తద్గురు ప్రభావిభ వాతిశయాప్తిలబ్ధ వి
ద్యాయుతుఁడై మనోజ్ఞ కవితా వనితా రమణుండు "లక్ష్మినా
రాయణుఁడ"న్నఁ బేరఁ జెలువారు వధానవిధాన విజ్ఞుఁడై!

నటి:—నాథా! సంతసించితిని. ఎట్టులున్న నిప్పు డీసభవారి రంజింపఁ జేయవలయును. కనుక నేఋతువును గురించి పాడవలయునో దేవర యనుజ్ఞ నీయవలయును.

సూత్రి:—అటులైన ఋతురాజం బనంబడు వసంతఋతువునుగురించి గాన మొనరించుము.

నటి:—అట్టులె (అని పాడుచున్నది)

ఉ॥ వావిరి నూత్నపల్లవ విభాసితముల్ గపురంపు టారతుల్
దీవపడంతు లీయఁగ మిళింద నినాదము భావగీతముల్
గా విలసిల్ల నీపిక శుక ప్రకరోక్తి ద్విజోక్తిగాఁగ శో
భావహమౌ వసంతుని వివాహముఁ జూడ మరుండు వచ్చెడిన్.

సూత్రి:—(సంతోసముతో) సుందరీ! నీ పాట యెంతయో హాయిఁ గూర్చినది. (అని వినినట్లు భావించి) ఏమిది! యేదియోధ్వని వినవచ్చుచున్నది. (అని దత్తచిత్తుఁడగును. తెరలో)
"రాధా! ఏమి మాటలివి? ఎఱుఁగనివారికిఁ జెప్పుము......"

సూత్రి:—(అర్థోక్తియందే) కల్యాణీ! ఇఁక మన మాలస్య మొనరింపఁ గూడదు. అల్లదే రాధిక చెలికత్తియతో ముచ్చటించుచుఁబ్రవే శించు చున్నది. నే నిపుడే కృష్ణపాత్రను ధరింపవలయునుగదా!

నటి:—అయిన నేనుసు సత్యభామ భూమిక ధరింపవలయును.

సూత్రి:—(నవ్వి) సెహబాస్! నీ కదియే తగియున్నది. ఇఁకరమ్ము.
(అని నడుచుచున్నారు) (తెరజారును.)

ఇది ప్రస్తావన.

---



శ్రీమత్పరదేవతాయై నమః.

# కల్యాణరాధామాధవము.

## ప్రథమాంకము.



(బృందావనము - చెలికత్తియతో
ముచ్చటించుచు రాధప్రవేశము.)

నిపుణిక :—(చిఱునవ్వు నవ్వి) రాధా! ఏమిమాటలివి? ఎఱుఁగని వారికిఁ జెప్పుము. నీ వెంత మఱుఁగు పఱచినను పులకాంకురములు మాత్రము భావమును వెలిబుచ్చుచునే యున్నవి. తరువాత, తరువాత.

రాధ :—తరువాత నేమున్నది? (అని కొంచ మూరకుండి చిఱునవ్వు నవ్వుచు) నెచ్చెలీ! నీకుఁ జెప్పక మఱి యెవ్వరికిఁ జెప్పెదను. నాఁడు;

మ॥ యమునాతీర విహార పర్ణసదన ♦ ప్రాంతంబునం దిందిరా
రమణుం గాంచిన దాది యవ్విభుని నా♦రాధించి సేవింపఁ జి
త్తము క్షోభిల్లెడు నెట్టి దుర్గతిగొ సం♦ధానం బొనర్పంగ న
ప్డు మదిన్ బంపెద నన్నుఁ గృష్ణుకడకే ♦ మున్నే సనేన్ నిర్దయన్.

నిపు :—(నవ్వి) రాధా! సంధాన మొనరించుటకు మనస్సు తప్ప నిం కెవ్వరు లేరా?

రాధ :—(మందహాసముతో) లే కేమి? తరువాత నీ వుంటివి.

నిపు :—పరిపోయినది. ఇంతకుఁ బూర్వమే, మనోహరుని హృదయ ఫలకంబునఁ జిత్రించుకొనిన నీ కింక నితరులతోడి పని యేమి యుండును?

రాధ :—(స్మృతి నభినయించి) ఆఁ! మఱచితిని. చిత్తము వే మైనది?

నిపు —(తెలియ నట్లు నటించి) ఎవరి చిత్తమువు?

రాధ:—ఇదియు నెఱుఁగవా? ఇంత యనభిజ్ఞ వైతి నేమి?

సీ॥ మోద మందుచు సర్వ♦ములు దలల్ పైకెత్త
మురళిఁ బూరించు నా ♦ ముద్దుకృష్ణుఁ
దనకేల మునికోలఁ ♦ గొని యాలమందలఁ
దోలు నా చిన్ని గో♦పాలకృష్ణు
నెమ్మోము దమ్మిపైఁ ♦ గ్రిమ్మిన భ్రమరంబు
లన ముంగురుల నొప్పు ♦ నసఘు కృష్ణు
నిండు వెన్నెలకాంతి ♦ నిరసింపఁగాఁ జాలు
చిఱునవ్వు లొలుకు నా ♦ చిన్నికృష్ణు

తే॥ గీ॥ గరము దళుకొత్త మౌళి సుం♦దరమయూర
పింఛమును దాల్చి కనులకు ♦ విందొనర్చు
రాధికాచిత్త పద్మచ♦ర న్మధువ్రి
తమును గనియున్నఁ జెప్ప రా♦దా లతాంగి!

నిపు :—రాధా! ఇంత వేల వైతి వేమి? నీవలెనె మ్మహాపురుషుఁడును సానురాగుఁడై ప్రవర్తిల్లుచుండె నని తలంచితివి కాఁబోలు. అతఁడు నీవంటివారి నెందరినో సంబాళించుకొన దలసి యుండును. ఇట్టి నీమనోహరుని, నీవేణుగాన ప్రియుని, నీవల్లవీ పల్లవుని నెందు జూచియుంటి నని చెప్ప నేర్తునో నీవే యూహించు కొనుము.

రాధ :—(వినయము తో) నెచ్చెలీ! అమ్మహాభాగుని చిత్తవృత్తి నరయక యిట్టు లాడెదవు; కాని సర్వవేద్యుఁ డగు నతఁ డెందరి

యొడ సమానుండేకదా! మహాత్ములకు నయితము తెలియరాని కృష్ణభగవానుని యనివార్యమగు ప్రభావము నిట్టి తూలనాడితివి. ఎంత వెఱ్ఱిపని చేసితివి? ఇదిగాక నెవ్వ రేవిధమున సేవించి యమ్మహాపురుషుని దాస్య మభిలషింతురో, యమ్మహాత్ముండు నా యా రూపముల వారివారి మనోభీష్టములం దీర్చుటకు సర్వథా సమర్థుం డగుచుండును. పెక్కు లేల? తనువు నయిత మర్పించి యానందదాయకుం డగు నా గోపాలచక్రవర్తికి నూడిగ మొనరించిన జన్మము చరితార్థ మొందు నని తలంతును.

నిపు:—అందరు నీవలెనే తను వర్పింపం దలంచిరా?

రాధ:—(చిఱునవ్వు నవ్వి) మిన్నకుండును.

నిపు:—ఇతం డొకవేళ నీప్రియుం డగు నేమో? చూచితివా రాధా!
(అని చిత్తరు వందిచ్చుచున్నది.)

రాధ:—(చూచి ససంభ్రమమున) నెచ్చెలీ! ఇతండే! ఇతండే!! ఆహా! ఏమి! ఈమురళీగాన వినోదము. ఇటు చూడవే! కన్ను లున్న ఫల మనుభవింపవే!

తే॥ గీ॥ సరసముగ మౌళి నెమలిపింఛంబు దనర
ముంగురులతోడం దెమ్మెరల్ ముచ్చటాడ
యమున దరి నున్న పొదరింటి యరుగుమీంద
మురళి వాయించు నా మనోహరునిం గంటె?

మఱియు;

తే॥ గీ॥ కలిత కమనీయ కర్ణయుగ్మప్రసక్త
పారిజాత లతాంత గస్పృష్ట భృంగ
తతి కృతధ్యానములు బ్రీతి కృతుల నీనం
బిల్లంగ్రోవినిం బూరించు ప్రియునిం గవితె?

సఖీ! కనులకు విందొనరించుచున్న నావేణుగోపాలుఁడు నీ కేమి యుపిత్రియము గావించెను? ఇటు చూడవేమి? ఆహా! ఏమి ఈవినోదము!

చ॥ చరణయుగంబు మాఱ్పడ ల॰స ద్వలయాంచిత పాణిపంకజ
స్ఫురణ వెలుంగ, ముంగురులు॰ముద్దుమొగంబునఁ జిందులాడ నే
మరకయు రంధ్రపంక్తిఁ బలు॰మారులు గప్పుచు విప్పుచుఁగా దలో
దరి! ముదమంద శౌరి వెసఁ ॰ దా మురళీనినదం బొనర్చెడిన్.

(అని హృదయపూర్వకముగ భక్తిభావమున నమస్కరించు చున్నది.)

నిపు :—(తనలో) బంగారమునకుఁ దోఁడు సౌరభముగూడ నలవడు చున్నది. (అని పైకి) అగు నమ్మా! నెచ్చెలీ! ఇది వ్రాసిన పటముగాఁ దోఁచుటలేదు. అంతయుఁ గన్నులకు గట్టినట్టు లున్నది. అట్టులేకదా!

తే॥ గీ॥ సజల జలద వినీల భా॰స్వచ్ఛరీర
కాంతిపుంజంబు మించి న॰ల్లడలఁ దనరఁ
బద్మములఁ గాంచి నేత్రముల్ ॰ పరిహసింపఁ
దొడఁగె; నెమ్మోము చంద్రుని ॰ దూరఁ జొచ్చె.

కాని రాధా! నే నొకటి యడిగెదను చెప్పెదవా?

రాధ :—చెప్పఁ దగినది యైనచో...

నిపు :—(అర్ధోక్తియందే) కాదు - కాదు - చెప్పఁ దగినదియే. రాగము లెన్ని?

రాధ :—(నవ్వి) రెండు.

నిపు :—అవి యెవ్వి?

రాధ :—(తొందరతో) అనురాగము - కాదు - కాదు (అని నాలుక కొఱుకుకొని) ఉదయరాగము, సంధ్యారాగము.

నిపు :—(తనలో) సెబాస్! రాధ కెటుచూచినను, బ్రీతిత మగు చున్నది యనురాగమే కదా! (అని పైకిఁ జిఱునవ్వు నవ్వి)

నీ కలవడినరీతినే పలుకుము. రాధా! అనురాగముమాత్రి మేల కాఁగూడదు? (కొంచెము మారకుండి) పోనిమ్ము ఇం దేరాగము లిఖింపఁబడినది?

రాధ:—(బొమముడిపాటుతో) సంధ్యారాగము.

నిపు:—(ఎత్తిపొడుపుగా) అనురాగము కాదుగదా?

రాధ:—(చిఱునవ్వు నవ్వి) సఖీ! పోనిమ్ము. ఇది సంధ్యారాగ మైనను నా కనురాగముగనే తోఁచిన దనుకొనుము.

నిపు:—(నవ్వి) అనురాగవతుల కట్టులే తోఁచుచుండును గాఁబోలు.

రాధ:—కావచ్చును. కాని నిపుణికా! నీ పరిహాసము లింకను మాన వుకదా! ఇటుచూడుము.

తే॥ గీ॥ సంజకెంజాయ మెఱుఁగులుజాలు వారఁ
బులుఁగు లిచ్చోడ నెలవుల ♦ కెలమిఁ బార
మంద విడనాడి యావు లం♦బా! యటంచుఁ
దమ నివాసంబులకుఁ జేరఁ ♦ దరలు చుండె.

ఇదిగాక,

తే॥ గీ॥ చెలువు మీరఁగఁ దరువులు ♦ చిగురు లెత్త
గోపబాలకులునుఁ బిల్లఁ♦గ్రోవిఁ గేలఁ
బూని మోహనగీతిక ♦ ముద్దు లొలుకఁ
బాడుచున్నారు మంద వెం♦టాడి కంటె?

నిపు:—ఓహో! గోపబాలుని వేణుగానము గూడ నాలించితివిగా! రాధా!

రాధ:—అదియు నడుగవలయునా? (అని పటమువంకఁ జూచి తన్మ యావస్థఁ జెందుచున్నది)

నిపు:—(తొందరపాటుతో) రాధా! రాధా!

రాధ:—(మిన్నకుండును)

నిపు:—(ఆశ్చర్యముతో) అప్పుడే కృష్ణుని వేణుగానరసంబున నోల

లాడుచుఁ బిలిచినను బలుకనంతటి స్థితిలో నుంటివా యేమి ? రాధా !

తే॥ గీ॥ పోతఁ బోసిన బంగారు • బొమ్మ యనఁగఁ
జేష్టలను దక్కి ప్రియుని వం•శీ నినాద
మోద సంరంభమున మేనఁ • బులక లొదవ
సరసఁ గూర్చుండి వినుచుంటె • జాణ ! యిపుడు ?

ఇట్టిమాయ లెన్నఁడు నేర్చితివి ?

తే॥ గీ॥ కష్ట సుఖములు చెలియ! భా•గము లొనర్చి
యనుభవించెద మని పల్కి•యల్లనాఁడు
మోస మొనరించి యొంటిమై•ముద్దుకృష్ణు
వేణుగానంబు విన నిప్పు • వెడలి నావె?

(తనలో) ఇదిగో నెచ్చెలి యేదియో పలుకుచున్నట్టు లున్నది. ఆలించెదఁ గాక.

రాధ :—(భక్తిభావముతో) మనోహరా! ఈమురళికి దాస్య మొసంగి నన్ను గన్నెత్తియైనను జూడ వేమి ? పరమేశ్వరస్వరూపుఁడ వగునీవు సంచరించుచోటగడ్డిపోచగనైనఁ బుట్టింపక నా కీపాడు జన్మ మేలకల్పించితివి ? అహా! ఈమురళి యెట్టితప మొనరించెనో కదా! అయ్యో! నాథా! నీమోవియందుసంచరించుపిల్లంగ్రోవిగ నైన జన్మించి నీకు దాస్య మొనరించు నంతటిభాగ్యము నా కేల కలుగదు కాఁబోలు. అయ్యో! కడ కెట్టి మంద భాగ్యురాల నైతిని!

ఉ॥ ఈచతురత్వ మెందుగల•దే బళిరే! కడు నద్భుతంబుగాఁ
దోఁచెడు చుట్టమో మురళి • తొల్లిఁట నీదగు మోవి నిల్లుఁగా
నోఁచిన దేమొ కోరి పలు • నోములు వేణువు, నాథ! యవ్విధిఁ
జోఁచితి నేఁ? ఫలంబు కొర•నోములు నోఁచినవారి కబ్బునే!

నాథా! మఱుజన్మమున కైనను బిల్లంగ్రోవిగ జన్మించి నీకు
దాస్య మొనరించు నంతటి యదృష్టము నాకుఁ జేకూర్చుము.
కమ్మతేనియబావి యనఁ దగు నీకెమ్మోవిపానక మానుచున్న
నీమురళి యెంతయో గొనియాడఁ దగియున్నది. అట్టులే గదా!

ఉ॥ పూనిక మత్తమత్ప్రటను ♦ బూచిన గ్రొన్ననతేనె లాని యెం
తేని మదిన్ ముదంబు వహి♦యించెడి మాడ్కి నితాంతమోద సం
ధానక మైన తావక సు♦ధారసధారలు జిల్కు మోవి గ్రో
లేనియ నాని యీమురళి ♦ దృప్తి వహించు టనేటిభాగ్యమో.

(అని కొంచ మూరకుండి యేదియో వినునట్లు భావించి)
అయ్యో! నాథా! ఎంతమాట పలికితివి? నాయందుఁ గల
వాత్సల్యముచే నిట్టులాడెదవు కాని వేఱొండుగాదు. ఒకమారు
చెదరిన ముంగురులను బైకెగఁద్రోయు భాగ్యము నీదాసు
రాలి కొసఁగ వేఁడుచున్నదానను. (అని అట్లుచేయఁబోవు
చుండును.)

నిపు:—(నివారించి చిఱునవ్వు నవ్వుచు) నెచ్చెలీ! ఇది చిత్తఱువు
గదా!

రాధ:—ఏమీ! చిత్తఱువా? (అని వెలవెలఁ బోవుచున్నది)

నిపు:—(తనలో) ఇం దాశ్చర్యమే మున్నది? ఇది చిత్తఱు వని నేను
మాత్ర మెఱిగింతినా? ఇఁక వ్రాతలో నున్నట్లు భావిం
చుకొనెడి యీరాధను గురించి చెప్పవలసిన దేమున్నది?
(అని పైకి) ప్రియునిఁ జూచుటతోడనే వెఱ్ఱిదాన వగుటయేగాక
పులకాంకితగాత్ర వైతి వేమి రాధా?

రాధ:—ఇ దేమే నిపుణికా! నీసంగతి నీవే వెల్లడించు కొనుచుంటివి.

నిపు:—(ఎత్తిపొడుపుగ) అగును. నేనే వెల్లడించుకొనుచుంటిని. చిత్త
ఱువును జూచినతోడనే నాయొడలే జలదరించి కాకరకాయ
యైనది. ఇంతియకాక నాయావనశ్రీదుర్భావ ముక్కపెట్టున

దళుక్కున మెఱుపుఁదీవ వలె మెఱసి విరిసినది. నానేత్రములే తేజఃపుంజములైనవి. వాస్తవమే రాధా! పాపము నీ వేమియు నెఱుఁగవు. పసిబిడ్డవు.

తే॥ గీ॥ కనలి నిగుడించు జెఱుకు వి ♦ ల్కాని పూవు
టమ్ము లంగ బునకు మిక్కు ♦ టంబు లగుట
కతన మెయినుండి వెడలు మా ♦ ర్గణము లనఁగ
జెలువునిం జూడఁగా నాకుఁ ♦ బులక లొదవె.

రాధ: —(దేహమును జూచుకొని తనలో) ఔరా! ఎట్టిప్రమాద మందితిని. నిపుణిక నిజమే పలికినది!

నిపు: —(చిఱునవ్వు నవ్వుచు) సరియే కాని రాధా! కృష్ణుఁడు నీతో డ నేదియో ముచ్చటించినట్లు నీపలుకులవల్లనే తెల్లమైనది. నేను గూడ వినవచ్చునా?

రాధ :—(సంతోషముతో) తొలుదొలుత నీకు వినిపింప నెంచితిని; కాని మాటలసందడి నావృత్తాంతము మఱచితిని. ఇపుడు వినుము. అతఁడు......(అని అర్థోక్తియందే లజ్జపడుచున్నది.)

నిపు :—(చిఱునవ్వు నవ్వి) ఇంతలో నింత సిగ్గెక్కడనుండి మెరువుఁ దెచ్చుకొంటి వమ్మా? రాధా! ఇక్కడ నీకు బరు లెవ్వరు లేరుగదా!

రాధ :—(లజ్జతో) సఖీ! వినినపిదప నన్నుమాత్రము మేలమాడ కుండినఁ జాలును.— అప్పుడు,

తే॥ గీ॥ ముద్దు మొగమునఁ జిఱు నవ్వు ♦ మొలకలెత్త
"రాధ! నినుఁ గాంచ నేఁడు దు ♦ ర్భరప్రమోద
మంది వచ్చితి" నంచు నా ♦ సుందరుండు
పలికె నోయమ్మ! మెయి గగు ♦ ర్పాటుఁ జెంద.

మఱియు,

చ॥ పలుకు లిఁకేల? శౌరి యిదె ♦ పల్కెరు బల్కిన యట్లతోఁచె న
ప్పలుకుల కుబ్బి మార్వలుక ♦ బల్కెడు గ్రిమ్మఱి నింతయేల ఓ
చెలియరో! నీ వెటుల్ గనిన ♦ చిత్తరు వట్టుల జూచుచుండు నేఁ
గలకథ విన్నవించితిని ♦గాని మృషోక్తులు వల్క నేర్తునే?

నిపు :—నీవు నిజమే పలికితివి. ఈ చిత్రకళా నైపుణ్య మట్టిది. ఇదిగాక చతురమతి యగు నా యోగిని;

ఉ॥ చిత్తరువుల్ పసందుగ ర♦చించెను జీవకళల్ గరంబు ద
ళ్కొత్తగఁ జూచినంత మదిఁ ♦ గోరిక లీరిక లెత్తఁ "బాపురే!
యిత్తఱి జీవ మందె నిది ♦ కృత్రిమ మెట్లగు" నంచు మోదముల్
హత్తుకొనంగఁ జేసెను న♦హా! యనిపించెడు భ్రాంతి నించెడున్.

రాధ :—వాస్తవమే పలికితివి కాని నిపుణికా! మనము పారితోషిక ముగా నిడిన యంగుళీయకమును గొని కడు సమర్థురా లగు నాతపస్విని తృప్తి వహించిన దనుకొందును.

నిపు :—అంత భాగ్యముగూడనా? రాధా! నీ విడిన ముద్దుటుంగర మప్పుడే యోగిని మఱల నా కిచ్చివైచినది. అంతట నేను మా రాధిక ముద్దు చెల్లింపవలయు నని చెప్పుచు మగిడి నియ్యఁ బోవుతఱి "నా ముద్దెవ్వడు దీరవలయును? ఇదిగాక రాధికకు నేనే ముద్దుటుంగర మిచ్చితి నని చెప్పు" మని నన్నే తొందరించి నది. ఇదిగో! నీయుంగరము నీవే ధరించుకొనుము. (అని పైకి దీసి సంతోషముతో) రాధా! రాధా! ఇది నీయుంగరము కాదు. కృష్ణుని ముద్దుటుంగరము !!

రాధ :—(శాంతముగా) నిపుణికా! పరిహాసముల కైనను బరిమితి కలదు.

నిపు :—(విరక్తిభావముతో)అటులేనినీవే చూడుము (అనియిచ్చును)

రాధ :—(చూచి, కృష్ణుని నామాక్షరములను గని మైమఱచి) నెచ్చెలీ! ఇప్పు డెక్కడనుంటినో నాకే తెలియకున్నది. ఆహా! ఏమి! ఈయానందము! "కృష్ణ" యను నీ రెండక్షరములే నాకిపుడు జీవనాధారము లైనవి. (అని కన్నుల కద్దుకొని వ్రేలికి ధరించుచున్నది)

నిపు:—సందియ మేమున్నది? (అని కొంచె మూరకుండి) ఈపె యోగిని కాదనుకొందును. ఏది? ఆచిత్తము నొకమా రిటు దెమ్ము.

రాధ:—(పటమంతయుఁ జూచుచుఁ గ్రిందనున్న చేవ్రాలు చూచి యాశ్చర్యముతో) నెచ్చెలీ! ఈచతురిక యెవ్వరు? (అని నిపుణికకు పటమందిచ్చుచున్నది.)

నిపు:—(చూచి కొంతవడి విచారించి సంతోసముతో) సుందరీ! ఇప్పుడు విశదమైనదా? ఈపె యోగిని కాదు. కృష్ణుని పరిచారిక; పేరు చతురిక. ఈవెలఁది తన చాతుర్యమునఁ గృష్ణుని వేణుగాన వినోదమునుఁ జిత్రించి యానెపమున మీ కిరువురకు సంధాన మొనరింప నిట్లొనరించిన దని యూహింతును. దీని కంతయు గృష్ణుని ప్రోత్సాహమే కారణము గావలయును. కాదేని, కృష్ణుని ముద్దుటుంగరము బానినకూఁతు రగు నీచతురిక కెట్టు లభించును? ఏది యెట్టు లున్నను నీ వింక ధన్యురాలవైతివి లెమ్ము. (స్మృతి నభినయించి) మఱచితిని. ఇందులకే కాఁబోలు నాపె యుంగరము మీఁది మఱలు నప్పుడు "మీరాధిక యిప్పుడు పెండ్లికూఁతు రయ్యె" నని చెప్పుచు చిఱునవ్వునవ్వి వెడలి పోయినది. ఆచిఱునవ్వున కర్థ మిదియనియే తోఁచుచున్నది.

రాధ:—(సంతోషముతో) కావచ్చును. కాని నిపుణికా! నినొక్కటి యడుగఁ దలఁచితిని. సమాధాన మీయవలయును.

చం॥ సరసపుఁబ్రేమ నెమ్మొగము చందురుపై విలసిల్లఁ బచ్చక
ప్పురపు విడెంబు శౌరి కిడు పూజ్యత నా కెపు డబ్బునే? సరో

ధరరుచి నొప్పు మాధవుపదద్వితయమ్ము భజింప నేర్తునే
గురుతర నాగకయ్యా హారి గూడి మెలంగెదనే తలోదరీ!

నిపు:—(సంతోషముతో) నన్నేల యడిగెదవు రాధా! అంతయు నీకృష్ణుని ముద్దుటుంగరముసే యడుగుము. నీసందియ మా యంగుళీయకమే తీర్పగలదు. ఇంత విచారించెద వేల? ఇదిగాక,

తే॥ గీ॥ అతుల సౌందర్య రాశి వీవబల! నిజము
మాధవుఁడు రూపవిజిత మన్మథుఁడు, మీకు
నిరువురకుఁ బొత్తుఁ గలిగింప నెంచెఁ బద్మ
భవుఁడు నేఁటికిఁ దననిందఁ బాపు కొనఁగ.

మఱియు నోసుందరీ! కృష్ణుఁడు నంతచేతకానివాఁడు కాఁడు గదా! ఎన్ని యిక్కట్టులు వచ్చినను నిన్నతఁడే తప్పక స్వీకరింపఁ గలఁడు.

తే॥ గీ॥ మేదినీతల మొక్క నిమేషమందు
గాల్చి దానిఁ బ్రతిష్ఠింపఁ గలిగియున్న
మాధవుఁడు గేవలుఁడె మహామహుల కరయ
నింతిరో! యసాధ్య మిద్ధాత్రి యెద్ది కలదు?

రాధ:—(హృద్గతమైనభావమును జిఱునవ్వునవ్వి వెలిబుచ్చుచున్నది)

( తెరలో )

అమ్మాయీ! రాధికా! ఇటు రమ్ము.

రాధ:—(విని చకితయై) నెచ్చెలీ! మాయమ్మ పిలుచుచున్నది. ఇఁక నింటి కేగుదము లెమ్ము. చిత్తఱువును దీసికొందువా? (అని కొంచె మూరకుండి) అక్కఱలేదు నేనే కైకొందును.

నిపు:—(చిఱునవ్వు నవ్వి) సోనిమ్ము. రాధా! నీవే కైకొనుము. (అని యిచ్చి కొంచెముదూరము నడచి) సుందరీ! ఇప్పుడు నీయుంగర మెంతయో కొనియాడఁ దగినదై యున్నది.

రాధ:—(వెనుకకు తిరిగి) ఎట్లు?

నిపు:—ఎట్టులా? సంధాన మొనరించుట కద్దిరయే యిప్పుడు మధ్యవర్తి యయ్యెను. (అని నడచుచున్నారు.)

(అవనిక జారును.)

ఇది ప్రథమాంకము.





శ్రీమత్పరదేవతాయై నమః.

# కల్యాణరాధామాధవము.

## ద్వితీయాంకము.



(ప్రదేశము : బృందావనప్రాంతము—విదూషకుని ప్రవేశము)

విదూష:—(నిట్టూర్పువుచ్చి) హాదైవమా! స్త్రీలోలుఁ డగు నీమాధవుని చెలిమిచేతఁగదా మోసపోతిని. ఇంక నాకేదిదిక్కు? ఏమిచేయుదును? నిన్నటిదినమున జతురిక రాధకడనుంచి యుంగరమేమో తెచ్చెనఁట. దానిఁ జూచినది మొదలుకృష్ణునకు రాధగోడనయేనఁట. ఆవిషయమును గృష్ణుని వేడుకచెలికాఁడనగు నాకేమో తెలియునని కాఁబోలు. సత్యభామచెలికత్తియయగు తొత్తుకూఁతురు పద్మిని నన్నుఁ బీడించుకొని తినుచున్నది. ఎట్టులో సర్పముఖమునుండి బయల్పడిన మండూకము తెఱంగునఁ బద్మినిచేతినుండి విడువఁబడిన నేను పీడవదలించుకొంటినిగదా యని సంతసించుచు రాత్రి యొకచోటఁ బరుండఁబోయితిని. అదియు నేనుండుతావడిగి తెలిసికొని నావెన్నంటియే వచ్చినది. పదంపడి 'దాగఁబోయినచోట దయ్యాలపో' రన్నట్లు నేనిక్కడ బరుండియున్నను నాప్రాణములఁ దీయుట కీపద్మిని యెక్కడనుండి దాపరించినదిరా భగవంతుఁడా! యని విసువు నుచుఁ దెల్లని యుత్తరీయమునుగప్పుకొని శ్వాసనిరోధించుచు

జచ్చినవానివితోనఁ బడియుంటిని. ఇదియంతయు గవాక్షము నుండి చూచినదిగాపునఁ బద్మిని చీపురుకట్ట నొకదానినిఁ గైకొని నాయొద్దకు వచ్చినది. పదంపడి ముందుగా నిటునటు గొంతవడి త్రొక్కువలె బిఱ్ఱబిగిసియున్న నన్ను మాటిమాటికి దొర్లించుచు నీదయ్య మిప్పుడే వదలిపోవఁ గలదని వీఁపంతయు వాయఁగొట్టఁ దొడఁగెను. అంతట చావుదెబ్బలకు వెఱచి బయటఁబడి 'తోత్తుకు శివమెక్కిన మొక్కక తప్పునా' యని రేపు తప్పక కృష్ణునియుదంత మంతయు నెఱిఁగించెద నని గడ్డముఁబట్టుకొని బతిమాలి యెట్టులో నాభూతమును వద లించుకొంటిని; కాని కృష్ణునిజాడయే కనుబట్ట దయ్యెను. శరీ రములు వేరువే రైనను మనము లొక్కటియగుటఁ గృష్ణుఁడు నన్ను విడచి యొంటిగ నింతవఱకుఁ బట్టుమని యొక్కచోట నుండియెఱుఁగఁడు. విచారింపఁగా నిందేదియో రహస్య ముండితీరవలయును. పద్మిని చెప్పినట్లు, రాధయం దనురాగము కలవాఁడై యొకవేళ బృందావనమందు విహరించుచుండె నేమో? తెలియదు. పోనిమ్ము; అచ్చటి కరిగియే నామిత్రుని దర్శించెదఁగాక. (అని రెండడుగులు వైచి) అల్లదే మందారమా లాలంకృతుఁడైన కృష్ణుఁడు బిల్లఁగ్రోవిని బూని యిటే వచ్చు చున్నాఁడు. నే నీతరువుదరి కేగి కృష్ణుని కలిసికొనెదఁగాక. (అని అట్లు చేయుచున్నాఁడు. అంతం బైనఁ జెప్పఁబడిన విధమునఁ గృష్ణుఁడు ప్రవేశించు చున్నాఁడు)

కృష్ణు:—(తనలో) ఇప్పటి కింకను రాధిక నాకన్నులయెదుట సంచరించు చున్నట్లు దోఁచుచున్నది. అట్టులేకదా!

చం॥ పడఁతుక "రాగ దే" యనుచుఁ బల్కిన మారుమొగంబు వెట్టి రెం
డడుగులు వైచి ముందునకు "నందియుకీ లెడలెన్ గనుంగొనం
దొడఁగుమి" యంచుఁ బల్కుచు, వధూమణి దూతి కరారవిందమం

దడుగిడి, య్యానెవంబునన్ ♦ యూరమునన్ ననుఁజూచెఁ బోవుచోన్.

మఱియు.

తే॥ గీ॥ నెలఁత, కెందామరలు భూమి ♦ నించుకరణి
ముద్దు పదములు పుడమిపై ♦ మోపి మదన
శరము లన వాడిచూపులుఁ ♦ బఱపు చెంత
నరిగెఁ జనలేక వెనుకకుఁ ♦ దిరిగి తిరిగి

విదూ:—ఓవయస్యా! ఇక్కడనుండియే యాశీర్వదించెద. విజయీభవ!

కృష్ణు:—(చూచి) ఓహో! సర్వకాలమిత్రుఁడగు మైత్రేయుఁడు కాఁబోలు. వయస్యా! ఇటు రమ్ము.

విదూ:—శరీరము స్వాధీనములోనుండినఁగదా వచ్చుటకు (అని శరీరముఁ జూపు చున్నాఁడు.)

కృష్ణు:—(చూచి ఆశ్చర్యమున) ఇదియేమి! మిత్రమా! ఈయవస్థ నీ కెవరు కల్పించిరి?

విదూ:—తొత్తుకూఁతు రగు పద్మిని.

కృష్ణు:—ఏకారణమున?

విదూ:—నీ కారణమున.

కృష్ణు:—(బొమలు చిట్లించి) నాకారణమునా? అదెట్లు?

విదూ:—(ఉద్రేకమున) అదెట్టులా! వినుము. బృందావన విహారిణి యగురాధిక నీ కేమో తనయుంగరమును బంపినదఁట. ఆవిషయము నాకుఁ దెలియునఁట. నేను తనకుఁ జెప్పలేద......

కృష్ణు—(అర్థోక్తియందే!) నీకుఁ దెలిసియుండినఁగదా చెప్పుటకు అందు నీదోష మేమియు లేదే!

విదూ:—లేకేమి! నీతోడిసాంగత్య మొనరించుటయే నాదోషము.

కృష్ణు:—(తనలో) సత్యభామ కీవిషయ మెవ్వరో చెప్పియుండవలయును. (కొంచెమూరకుండి) యెవ్వరో యననేల? అంతకుఁ బద్మినియే చాలును.

విదూ:—ఇప్పటికి సత్యభామ కొట్టించుటయైనది. ఇంక నీతరువాయి యున్నదా యేమి!

కృష్ణు:—ఎట్లు గ్రహించితివి?

విదూ:—నీ యాలోచనంబట్టియే.

కృష్ణు:—నాయాలోచన యేమని?

విదూ:—మున్నే చెప్పితినిగదా, ఇంక నీతరు......

కృష్ణు:—(అర్థోక్తి యందే) నవ్వి వెఱ్ఱివాఁడా! అది కాదు. మిత్రునకుఁ గలిగిన యవమానమునకుఁ బ్రతీకార మేమని?

విదూ:— చిరంజీవివి కమ్ము. ఇప్పటి కెట్టులో నీదర్శనము లభించినది. ఇంక నే నేగెదను.

కృష్ణు:—మిత్రుఁడా! నిలువుము. నిన్నొక పనియందు నియోగింపవలయు ననుకొంటిని.

విదూ:—(నిలువఁబడి) ఏపనియందు? గారెపక్కులు విఱచుటయందా? అందు నేనే పూర్ణప్రయోజకుఁడను. ఏమందువా! మొన్నటి సమారాధనమున

క॥ వంటను బెట్టిన గారెను
గంటును బడకుండ నొరుల ♦ కంటను బడకే
తింటిని చోద్యము నొందఁగఁ;
గంటివె నావంటివాని ♦ బ్రహ్మాతలమందుఁ.

కృష్ణు:—(నవ్వి) మిత్రుఁడా! ఇంక నూఱకుండుము. నీవర్ణన నుతిమించి రాగమునఁబడినది. మొత్తముమీఁద 'బ్రాహ్మణో భోజనప్రియః' యనెడు లోకోక్తిని సార్థకపఱచితివి; అంతియేచాలును.

విదూ:—ఇంక నేపనియందు?

కృష్ణు:—చెప్పెదనుండుము. దట్టములగు తీవజొంపములచే నల్లిబిల్లిగా నల్లుకొనఁబడిన నీపొదరింటివైపునకు నడుపుము. (అని యొక శిలా వేదికపై నిరువురు కూర్చున్నారు.)

కృష్ణు:—వయస్యా! లోకములో దర్శనీయము లగు వస్తు వేవియో చెప్పఁగలవా?

విదూ:—ప్రకృతి.

కృష్ణు:—ఇంకొకటి లేదా?

విదూష:—(తనలో) ఇతఁడు రాధనుగురించి పలుకుచున్నట్లు తోఁచెడిని. సందియములేక మాటాడడఁగాక. (పైకి) నీవు లేవా?

కృష్ణు:—వెఱ్ఱివాఁడా! రాధనుగురించి మాటాడుచుంటిని.

విదూ:—(తెలియనట్లునటించి) ఓహోహో! రాధ, అంతటి చక్కని చుక్కయా యేమి?

కృష్ణు:—మిత్రమా! నీవుచూచినచో నిట్లు పలుకవు. ఆపెయే చక్కనిది కానిపక్షమున నీకలోకమునఁ జక్కనివా రెవ్వరు? పెక్కులేల? ఆపె చెక్కుటద్దములఁ బ్రతిబింబమును జూచుకొన వచ్చును.

విదూ:—అద్దములు లేవా?

కృష్ణు:—పోవి కాదు కమ్మ తేనియబావి. ఇదిగాక కన్నులు కాటుక పిట్టలు.

విదూ:—(నవ్వి) మిత్రమా! నీ కేదికాని మతిపోయినట్టు లున్నది. పిట్టల నెట్టు వరించితివి?

కృష్ణు:—నీ వన్నను సరియే; కాని

సీ॥ చూచెనా యాలేమ ♦ చూపుల నిగుడించి
కూరున్న నను దారుకూరు చేయు
నవ్వెనా చిఱునవ్వు ♦ నివ్వటిల్లగ నింతి
మునినైన భోగకాముని గాఁ జేయు
బలికెనా యాబోటి ♦ పలికిన పల్కులో
వారు నైనఁ దన మనోహారునిఁ జేయు

నడచెనా యారామ ♦ నడకలదలుకుల
గురువైన స్మరతాప ♦ గురునిఁ జేయు

తే॥ గీ॥ అవుర! యేమని చెప్పుదు ♦ నతివచక్క-
దనముఁ, బంకజభవుఁడు చిత్తరువునందు
వ్రాసి సుందరమొప్ప జీవంబు నించె
నేమొ; కాకేని యాసొబగెట్లు కలుగు?

విదూ:—నీకు నయితము మోహముగలిగించినది కావున నాపె లావణ్యవతి యనియే చెప్ప నగును.

కృష్ణు:—సందియమేమి?

శా॥ ఆ లేనవ్వుల సొంపు, లామృదుపదన్యాసంబు, లావిభ్రమం,
బాలీలాస్పద వాగ్విలాస గరిమం ♦ బాచెల్వ, మాప్రాయ, మా
వాలుఁగన్నుల చూపు, లామెఱుపుఁదీవంబోని మైచాయ,యా
పాలుఁ గారెడి మోము వైఖరినిఁ జెప్పన్నేర్తునే మిత్రమా!

విదూ:—అటులైన లోకములోని సుందరీమణుల కిఁక ముక్తిలేదుగాఁబోలు.(కొంచెమూరకుండి) పోనిమ్ము. మిత్రమా! నీకాసుందరితోడి పరిచయ మెట్లు కలిగినది?

కృష్ణు:—(చిఱునవ్వు నవ్వి మురళినిఁ జూపించి) వయస్యా! అంతయు నీమురళినే యడుగుము.

విదూ:—(నవ్వి) ఓహో! తెలిసినది పిల్లఁగ్రోవి నొకదానినిఁబూని స్త్రీజనమును జుట్టుజేర్చుకొనెడి యలవాటు నీకుఁగలదుగదా!

కృష్ణు:—(మాటతప్పించి) మిత్రమా! వినుము. అట్లు చతురిక నా కిడిన యంగుళీయకమును గొని సంతసించిన, నేను రాధికనుజూడ బృందావనమ్ములోని కరుగ నిశ్చయించుకొంటిని. అప్పుడునీవు......

విదూ:—(అడ్డో త్తియుండే) ఇఁక మే మొక్క వేళఁ గనబడినను మాతో నీ కవసర మేల్లయుండును? తరువాత

కృష్ణు:—(నవ్వి) నీ యొకసక్కెయముల కేమి; కాని చెలికాఁడా! నీ వాచిత్ర మెన్నటికిని జూడవు.

విదూ:—(ఆతురముతో) ఏమిచేసినది? తోడ నేవచ్చి నీచేయిఁ బట్టుకొనినదా?

కృష్ణు—(నవ్వి) మూర్ఖుఁడా! తొందర లెందులకు? వినుము. అట్లు బృందావనములోని కేగుసరికి రాధిక తన చెలికత్తెయతోడఁదీవలచేఁ దూగుటుయ్యెలగ నమర్చి పాటములు మింటి కంటునట్లు గేకిసలాడుకొనుచు నూగుచుండెను.

విదూ:—తరువాత, తరువాత.

కృష్ణు:—పిమ్మట చెలికత్తియ నన్నుఁ గని డగ్గుత్తికఁదోఁప దిగ్గునదిగ్గి స్వాగత మీయఁగాఁబోలు నా కెదురుగ వచ్చినది

విదూ:—(ఆతురతతో) రాధకూడనా?

కృష్ణు:—వెఱ్ఱివాఁడవువలె ; ఎంటివి.

చ॥ తరుణియు, నన్నుఁగాంచి తొలుతన్ గరకంకణనిక్వాణంబు సుం
దరముగఁ దోఁప నెన్నడుము ♦ నాట్యమునల్ప, లసత్కుచద్వయ
స్ఫురణఁ జెలంగ, ముంగురులు ♦ ముద్దుమొగంబున సందడింపఁ గ్రి
క్కిరిసిన పోకచెంత కరి♦గెన్ నను సిగ్గొకవింతఁ గొల్పఁగన్.

విదూ:—మంచిది. చిత్ర మంటివి ఇదియేనా?

కృష్ణు:—వినవలసిన దట్టులే యున్నది. అంతట నన్ను బహూకరించి చెలికత్తియ యొకయాసనమందుఁ గూర్చుండ నియమించినది. తదుపరి రాధతో నెట్లు పరిచయ మొనఁగూడునా? యని విచారించి తుద కీమురళి నదృశ్య మొనరించి వెదుక మొదలిడితిని. అంత

గీ॥ మురళిఁ గోల్పోయి యటు నిటు ♦ మొనసి వెదకఁ
దొడఁగు నన్గాంచి చిఱునవ్వు ♦ గడలు కొనఁగ
మాటి మాటికిఁ గొమ్మల ♦ జాటుచేసి
దృష్టి నిగుడింపసాగె నిం♦దీవరాక్షి.

విదూ:—ఇంత పెట్టిబాండపైతి వేమని కాళాలు వచ్చినది; కాని మిత్రమా! నీయందాపె కనురాగ ముప్పట్లు స్పష్టపడినదా?

కృష్ణ:—(చిఱునవ్వునవ్వి) స్పష్టపడినదో లేదో నిర్ణయించు భారము నీయందే వదలితిని. అప్పుడు;

శా॥ కేలన్ దాల్చెడు వంశి గొంటి వని పల్కెన్ గృష్ణ డోయమ్మ నీ చాలిన్ గొనియున్న నిమ్మనుచు నెంతో నా నెచ్చెలిన్ జాలిన్ జూచి కనంగదే యనుచు వక్త్రంబున్ విడల్పన్ వెసన్ మోవిన్ దోచిన బిల్లఁగోవిఁ గని యాత్రిన్ నించె సిగ్గొందుచున్.

విదూ: (నవ్వి) మంచి విషయము వయస్యా! తనకు జరిగిన భంగ పాటునకు నిన్నూరక తిట్టుచు, వచ్చినదారినిఁ జూచుకొన లేదా యేమి?

కృష్ణ:—(మాట తప్పించి) అంతటఁ జెలికత్తె మురళిని నా కొసంగి మరల దర్శన మొసంగవలయు నని కోరుచుఁ గడపటిసారి—

మ॥ "పదవేమే" యని రాధఁ బేర్మి నదలింపన్ ముందుకున్ సాగి తాఁ బదపద్మంబులు గరిదె నిందు నిలువన్ బాగించు వాల్చూపులున్ గదురన్ నిల్చి కొలంది కాలము బలాత్కారంబం బంచెఁ బున్నాగ మో మదిరాక్షీ! కనవే యటంచుఁ బలికెన్ మందస్మితం బొప్పఁగన్.

"అగునే రాధా నిశ్చయముగ నీచేలాంచలమును బురుషో త్తముఁడే పట్టుకొనెను లెమ్ము" అని విభ్రుణిక మేలమాడుచు రాధికను దోడికొని పోయెను.

విదూ:—(నవ్వి) నీవుకూడ వారివెంటనే వెళ్లక పోయితివేమి?

కృష్ణ:—(నవ్వి) అట్టి ప్రియత్న మొనరింతు వనియే నీతో ముచ్చ టించుటకు వచ్చితిని.

విదూ:—(నవ్వి) ఎట్టిదైనను కొలుత సత్యభామచేతినుండి బయటఁ బడినప్పటికి గదా! పేమంటావా, పరిధానిక యాడు పద్మినియే

నాకు రెండు వర్ధించినది. ఇప్పుడు స్వయముగా సత్యయే మఱల నీకు రెండు.........

కృష్ణ:—(మాట తప్పించి) సరియే కాని వయస్యా! నిన్నొకపనియందే నియోగించితిని. ఇఁక బొమ్ము.

విదూ:—చిత్తము. అట్లయితే (అని తనలో) ఇది నాచావునకు వచ్చినది. (అని నుదుటిమీఁదఁ గొట్టుకొనుచు వెళ్లుచున్నాఁడు.)

కృష్ణ:—(తనలో) మైత్రేయుఁ డట్లు వెడలిపోయెను. నేనును సత్యభామామందిరమున కరిగి, యామె చిత్తవృత్తులఁ గనిపెట్టెదఁ గాక. (అని రెండడుగులు ముందుకు వైచి) మందిరమువర కెందులకు? (ఎదుటఁ జూచి) ఇదిగో యీసరోవరతీరమందే చెలికత్తియతోడ నదియా ముచ్చటించుచు సత్యభామ యిటే వచ్చుచున్నది. నే నీచెట్టుమఱుఁగున నుండి వీరల సంభాషణ మేదియో యాలించెదఁ గాక (అని అట్లు చేయుచున్నాఁడు.)

(ఈవిధమున సత్యభామ సఖిద్వితీయయై ప్రవేశించుచున్నది.)

సత్య:—సఖీ! పద్మినీ! ఈసరోవరతీరమున మలయానిలసుఖ మనుభవించుచుఁ గొంతవడి నిందే విశ్రమించెదము. ఏమందువు?

పద్మి:—అట్టులే (అని యిరువురు కూర్చొనుచున్నారు.)

సత్య:—మాటలయందుగల చాకచక్యము గ్రియలవలన వెలిబుచ్చనేర వేమే పద్మినీ!

పద్మి:—(నవ్వి) ఏవిషయ మమ్మా సఖీ!

సత్య:—మైత్రేయుఁ డేమనెను?

పద్మి:—(నవ్వి) ఇదియా పాప మతనిని నిష్కారణముగ బాధించితిని. అతని కేమియుఁ దెలియదు.

సత్య:—పోనిమ్ము. రాధ యెవ్వరో తెలిసికొంటివటే?

పద్మి:—వృషభానునికూఁతురని చతురిక చెప్పెను.

సత్య:—(స్మృతినభినయించి)మఱచితిని. ఇప్పుడు స్మృతికివచ్చినదిః కాని పద్మినీ! రాధ నాకంటె చక్కని దఁటే?

పద్మి:—అది యంతయు నాకుఁ దెలియదు, కాని కృష్ణుని హృదయంబున నీ కెఁకఁ జోటులేదనిమాత్రము తెలియును.

కృష్ణు:—ఓహోహో! ఇదంతయుఁ బద్మిని సేయుచున్న కుట్రయే. ఈర్ష్య కిదియే ప్రథమసోపానము. (కొంచెమూరకుండి) ప్రియురాలేదిమో పలుకుచున్నట్టు లున్నది. యాలించెద గాక.

సత్య :—నెచ్చెలీ! నా యెదుట రాధ నాథునకు విడియ మిచ్చుచుండుటఁ జూచిసహించుదు నఁటే?

కృష్ణు :—(నవ్వి) నే ననుకొనినట్లే యైనది. ఒక్కసత్యకే కాదు, లోకములోని స్త్రీల కెల్లరకు నీయీర్ష్యలేనితన ముండుట సహజమే. అట్టులే కదా!

మ॥ కలకాలంబును భార్య లిర్వురు మహోగ్రస్ఫూర్తిఁ బోరాడ వా
రల సాకన్ గన నేరకే శివుఁ డపర్ణాదేవినిన్ మేనిలో
గలయన్ జేసియు మూర్ధభాగమున గంగన్ నిల్పి శైలంబునన్
దల యెత్తన్ దప మొప్పసల్పుచు నమోనారాయణా యంచొగిన్.

ఇప్పుడు పద్మినిమాత్ర మూరకుండునా?

పద్మి :—(ఈసడింపుగ) ఏమో యెట్లు సహించెదవో నా కేమి తెలియును? ఎంత నంగనాచివే అమ్మా!

సత్య :—(బొమలు చిట్లించి) అంతకోప మెందులకే పద్మినీ?

పద్మి :—తెలిసియుండియు న న్నడిగినందులకు చూచినవారికి నేను కయ్యము పెంచినట్టు లుండదా?

కృష్ణు :—(నవ్వి) ఈచెలికత్తియల కుండు బుద్ధికౌశలములలో నిది యొకటి.

సత్య :—కాని నెచ్చెలీ! ని న్నొకటి యడిగెదను చెప్పెదవా?

పద్మి :—అడుగుము,

సత్య :—ఒకవస్తువును దొలుతయనుభవించుచు దానిని విడిచి రెండవ దానిని గ్రహించుటలో కారణ మేమి ?

కృష్ణు :—(నవ్వుచు) చక్కని ప్రశ్న యడిగినది. పద్మిని యే మనునో ?

పద్మి :—(ఆశ్చర్యముతో) నెచ్చెలీ ! న న్నడిగెద వేమి ? తొలుత నొకపూవుయందలి రసమును గ్రోలి మఱల రెండవపూవునకై తిరిగెడి యాకొాదమతుమ్మెదను జూచి నిరాశఁ జెందుచున్న యా పద్మిని నడుగుము.

కృష్ణు :—(మెచ్చుకొనుచు) చక్కని సమాధాన మిచ్చినది. ఇప్పుడు గదా పద్మిని యన్వర్థనామధేయ యైనది.

సత్య :—(చూచి నవ్వి) అటులైన నా కొాదమతుమ్మెదనే కొంతవడి నిందించి తాపమునకుఁ గొంత శాంతిఁ జెప్పుకొనియెదగాక.

పద్మి:—(తనలో) కృష్ణుని నెపమునఁ గాఁబోలు.

కృష్ణు :—ఇదియుఁ గొంత యుక్తముగనే యున్నది. ఆలించెదఁ గాక.

సత్య :—(తుమ్మెదవంకఁ జూచి వ్యంగ్యముగ)

చ॥ సరస సుగంధసంకలిత ♦ చంపకముల్ విడనాడురీతి నో
విరసవుఁ దేఁటి ! మల్లియల ♦ వీడి సుధారసధార లాన సుం
దర జలజాతగర్భ సము♦దంచిత భాసుర వేదికాతలాం
తరమున నుండు, మారశర♦తాపమునన్ జెలి కుందుచుండఁగన్.

ఇదిగాక,

మ॥ రవి యస్తంగతుఁ డయ్యె నంచు నెదలో ♦ రవ్వంత యేనిం దలం
పవు నీరేజసుధారసం బనుభవిం♦పం జూతు వేకాని యుం
క విచారింపవు నీదు దుర్గతికి, భృం♦గంబా! కృశించెన్ లతాం
గి, వియోగార్తిఁ దలంప వింతటఁ బ్రియా♦కేళీసమారంభముల్.

కృష్ణు :—సెబాస్ ! వర్ణనకుఁ దగినట్లే సూర్యుఁడుకూడ నస్తాద్రి కరుగుచుండెను.

సత్య :—ఓ! గండుతుమ్మెదా ! ఇంకనైన నను నీడుండగము మానవుగా !

శా॥ కానీలే, యిటువంటి పేటి లేఁక పాఁగంబోవు భృంగంబ! నీ
వా నన్నుఁ మఱపింపఁ జూచెదు, బలే ♦ తమ వ్యాంగనావక్త్ర చం
ద్రానం బద్మిని బొంది తద్రీతిని మోదం బందు పన్నోరు నా
కేనిఁ సిగ్గునులేదటం చడలు నీ యింతిఁ విలోకించుమా!

పద్మి:—నచ్చెలీ! బాగుగాఁ బలికితివి. పగసాధించుకొనుట కిట్టులే
పలుకవలయును.

సత్య:—ఓ! భృంగమా! నీవెంత దిట్టవైతివిరా!

ఉ॥ తీయనిపల్కులం బలికి ♦ తీరని మోహము పెంచి కాంతలన్
మాయ లొనర్చు పూరుషుల ♦ మాడ్కి మధువ్రత! చంచలోద్ధతిన్
బోయెద వొక్కపుష్పరస ♦ ముం దొలఁ గ్రోలి మఱొక్కపూవుకై
మాయురె నమ్మ కెట్లు మతి ♦ మాలిన మీమగవారివాక్యముల్.

కృష్ణ:—బాగుగా నెత్తిపొడిచితివి. కాని ప్రియా! నీ కోపమిప్పటి
కైనను జల్లారినదా! (తనలో) నాకును భ్రమరీవ్యాజమునఁ
బయల్పడుట కిదియే సమయము (అని యువతులకు వచ్చి)

మ॥ అళినీ! కాంచితె? పద్మినీ రసమరం ♦ దానందచిత్తుండు నీ
చెలువుండైన మధువ్రతంబిత్రఁడ వ ♦ చ్చెన్ బాహుపాశంబునన్
బలిమిన్ గట్టుము పోవినొక్క మటుపై ♦ నన్ గోపమున్ బాయు
మట్టుల కాదేని సరోజగర్భమున నె ♦ ట్లో నన్ను బంధింపుమా?
(అని నమస్కరించును)

సత్య:—(దూరముగా జరిగి కోపముతో) అన్యాయ్య [illegible] కాదు. మా
ధవా! నీ చాపల్యమును నా[illegible]ము.

శా॥ చాలుంబో [illegible] ♦ [illegible]
[illegible] కాంచిరి [illegible]
ద్వాలాలింగనసౌఖ్యవైభవము నూ ♦ వన్ రాగలం [illegible]? నీ
[illegible] గాంచవచ్చితివి. కాంత! పోయెద నీ [illegible]

(అని నిరాకరించి చెలికత్తియవంకఁ జూచి) నెచ్చెలీ! ఇఁకఁ జాలురమ్ము అంతిపురంబున కరిగెదము. (అని వెనుకకుఁ దిరిగి చూచుచుఁ బోవుచున్నది. పద్మిని చిఱునవ్వు నవ్వుచున్నది.)

కృష్ణు :—(ముక్కుమీఁద వేలువైచికొని) ఔరా! సత్య యెంతటి కోపశీల యయ్యెను? (కొంచెము ఆరకుండి) ఇదియు నొకవిధమైన పొలయల్కకాబోలు. కానిమ్ము. నా వేడుకచెలికాఁడు రాధ కడనుండి వచ్చుచుండెనో లేదో చూచెద. (అని రెండడుగులు ముందుకు వైచి చూచి) అల్లదే నాసఖుఁడితఁడే వచ్చుచున్నాఁడు. ఏమి వినిపించునోగదా. ..............................

విదూ :—(తొందరతో ప్రవేశించి) మిత్రమా! జయము. జయము.

కృష్ణు :—(ఆతురతతో) ఏమీ! మనకు జయమే కలిగెనా వయస్యా!

విదూ:—(ఉద్రేకముతో) కా కేమి; నే నేగుటయు జయముకాకపోవుట యుఁ గూడనా? త్రోవలో ముచ్చటించుకొందము రమ్ము.

(అని నడచుచున్నారు.)

(తెరజారును)

ఇది ద్వితీయాంకము





శ్రీమత్పరదేవతాయై నమః.

# కల్యాణరాధామాధవము.

## తృతీయాంకము

పరిదేశము: బృందావనము.

(కృష్ణుఁడు విచారించుచు ప్రవేశించు చున్నాడు.)

నిన్నటిరాత్రి చెలికాఁడు రాధికావృత్తాంతము వినిపించినది మొదలు కంటికి నిద్రయే లేదు. ఇప్పుడెట్టులో తెల్లవారినది. (అని యొక దిక్కువంకకుఁ జూచి సంతసించుచు) ఆహా! ఇప్పటికి గదా ధన్యుడఁనైతిని. ఏమనిన;

తే॥ గీ॥ అరయఁ గ్రొమ్మావిచిగురు జిగురాకుఁ బోని
ముద్దులొల్కెడి మారాధ ♦ మోవికెంపు
సొంపు వహియించెనో యన ♦ నింపు మీర
భానుఁ డుదయించెఁ బూర్వ ది♦గ్భాగమందు.

పద్మినీకాంతుని రాకకై నిరీక్షించుచున్న యీ పద్మిని విరహానల తప్తయయ్యెనో యనునటుల సంకుచితముఖయై యిప్పుడు గదా ధన్యత్వము వహించినది! ఏమందువా?

తే॥ గీ॥ వరుఁడురా, దరహసితాబ్జ♦వదన యగుచు
దనరు సాధ్వీ లలామ చం♦దమునఁ దనదు
రమణుఁ డరుదేరఁ బద్మినీ ♦ రమణి మోద
మందెనో యన వికసించె ♦ నౌర! యిపుడు.

ఇట్టులేకదా లోకమునందు సమస్త చరాచరములుఁ దమ తమ ప్రియుల శుభాగమనమునకై యభిలషింతురు. (స్మృతి నభినయించి) మఱచితిని, ఈ సమయమున రాధిక పూజామందిరమున నుండునని కదా మైత్రేయుఁడు వచించెను. ఇదే సమీపించితిని. (ఎదుటఁ జూచి.) ఓహో! ఆ సుందరియే కాఁబోలు.

తే॥ గీ॥ లలిత బాలరసాలసాలముల చెంతఁ
గాంత వనమల్లికాపుష్ప ♦ కలిత మగుచుఁ
దనరు పొదరింటియందు రా♦ధాలతాంగి
మోకరిలి నుతిసల్పెడు ♦ మూసి కనులు.

మంచిది. నేనును జెంతనున్న నీ రసాలవృక్షము నాశ్రయించి కొంతవడి రాధయొనరించు స్తోత్రపద్ధతిఁ బరిశీలించెదఁ గాక. (అని అట్లు చేయుచున్నాఁడు. అంతఁ దెరనెత్తఁగాఁబైనఁ జెప్పఁ బడినట్లు రాధ ప్రవేశించుచున్నది.)

రాధ :—

శా ॥ ఓ దైత్యాంతక! యోకృపాజలనిధీ! ♦ యోభక్తకల్పద్రుమా!
యోదామోదర! యోత్రిలోకభరణా!♦ యోసత్య నిత్యాకృతీ!
యోదక్షాధ్వర వైరి పూజితపదా!♦యోవిశ్వనిర్మాణ! దే
వా! దీనావన! నన్నుఁగావు మిఁకనా♦థా! దివ్యసంపత్ప్రదా!

దేవా! నీమహిమంబు లనంతంబులుగదా! నాఁడు పిల్లంగ్రోవి సద్నృత్య మొనరించినప్పుడే నీప్రభావము తెల్లమయ్యెను. అప్పుడే నిన్నొకసారియేనిఁ గనుంగొనఁ గోరిక యుండెడిది; కాని నన్నాశ్రయించిన యాపాడు సిగ్గందులకుఁ దావీయదయ్యెను. అయినను.

సీ॥ నీలమేఘచ్ఛాయ ♦ నెగడు నాకనమేనుఁ
గాంచితినా నిన్నుఁ♦గాంచినట్లె!

తరులతోద్యాన వి♦తాన నీలవు సౌరు
గాంచితినా నిన్నుఁ♦గాంచినట్లె
యమునా తరంగిణీ ♦ విమల జలంబులఁ
గాంచితినా నిన్నుఁ ♦ గాంచినట్లె
శైలగుహాంతరా♦లోల గాఢతమంబు
గాంచితినా నిన్నుఁ ♦ గాంచినట్లె

తే॥ గీ॥ అనుచుఁ దలపోసి సంతస ♦ మందుచుంటి
నాథ! యొకమారు నీరూపు ♦ రాధకిపుడు
జూపఁజాలవె తక్కిన ♦ గోపలోల
నేత్రిలరయఁగఁ జుట్టాలె ♦ నేనుకాన!

కృష్ణు:—(ఆశ్చర్యముతో) ఔరా! ఎందరినో చూచితిఁగాని యిట్టి నిష్కలంకమగు ప్రేమస్వరూపిణి నెందునుజూచియుండను. ఇఁకఁ జూడను. (కొంచె మూఱకుండి), ఒక్క ప్రేమయున నేల? భక్తి భావముగూడ ముద్దులుమూట గట్టుచున్నది. చతురిక చెప్పిన దంతయు వాస్తవమే!

రాధ:—ప్రియా! ఇప్పటికైనను నీకుఁ గనికరము గలుగదుకదా? అయ్యో! కన్నులు బొడిచికొనినను నీరూపు గనఁబడదయ్యె. నిన్నటినుండియు బొత్తిగ వెఱ్ఱిదాన నైతిని. ఏమందువా?

సీ॥ పూర్ణచంద్రునిఁ గాంచి♦పొల్చుపారు చిఱునవ్వు
లొలుకు నీ మోమంచుఁ ♦ దలఁతు మదిని
చెలఁగి క్రొమ్మావి కెం♦జిగురాకుఁ దిలకించి
నీదగు కెమ్మోవి♦గాఁదలంతు
నల్లకల్వల తోర♦ణంముఁ గాంచి నీచూపు
లిట్లుండ బోలునం ♦ చెలమి నెంతు
గగనంపు నీలిమఁ ♦ గన్నారఁ బరికించి
చొక్కంపు నీరూపు ♦ జూచుకొందుఁ

తే॥ గీ॥ గొదమతుమ్మెదబారు దృక్కోణములకుఁ
దోఁప నీకురులంచును దువ్వఁజూతుఁ
దమ్మిలంగని నీదు సుందర పదార
విందయుగ్మమటంచు సేవింతు నాథ!

కృష్ణు:—(నవ్వి) రాధ యిప్పుడు నిక్కముగా వెఱ్ఱిదైనది (అని రాధ నుద్దేశించి) రాధా! నీ వొక్కదాన వేకాదు నేను సయితము వెఱ్ఱివాఁడ నైతిని. ఏమందువేని నిన్నటి రేయి నా కలయందు;

మ॥ తరుణీ! మెత్తనిపాన్పునన్ గపటనిద్రన్ జెందు నన్గాంచి ని
ద్దురవోయెన్ బ్రియుఁడంచు నీవు తొలిముద్దున్ బెట్టమోమోడి క్రి
మ్మలి నవ్వన్ గొనకేగుదెంచెదవె కొమ్మా! యంచుఁ గేలందిము
ద్దు రహిన్ బెట్టుచుఁ గన్నులన్ దెఱచి యెంతో వెఱ్ఱినై తిన్ గదే.

భళిరా! ఈపె యనురాగ మెంతయుఁ బ్రశంసనీయమైనది! (కొంచె మూఱకుండి) అదిగో, ఇంక నేదియో పలుకుచున్నట్టు లున్నది వినెదగాక.

రాధ:—(సంతోషమున ఆత్రిముతో) ఇప్పటికిగదా జన్మ సార్థకమైనది. నాథా! వచ్చితివా! రమ్ము. ఇటుకూర్చుండుము (అని కృష్ణుఁడు వచ్చినట్లు భావించి శరీర మంతయు నిమురుచు డగ్గుత్తికఁదోఁప) ప్రియా! ఇదేమి?

చం॥ అడుగులు నొచ్చెఁ గంటకశిలావృతమైన వనీస్థలిన్ శ్రమన్
వడివడి నేగుదెంచ యదునందన! నాదు కరారవిందమం
దడుగులు మోపుమయ్య భవదాస్యము నందలి స్వేదబిందువుల్
దుడిచెదఁ గందియున్న బదతోయజయుగ్మము మెల్లనొత్తుచున్.

ఆయ్యో! నాథా! ఎంత శ్రమఁ బడితివి? నేను పిలిచినంతనే నీకింత తొందర యేలకల్గెను? ఇటుచూడుము, పదములెంత కంది యున్నవో. అయినను;

ఉ॥ కందెనుబో పదంబులు, ప్రయాసము సుంతయు దగ్గలేదు మే
నొందెఁ బరిశ్రమోద్ధతిఁ గనుంగవలోనికిఁ డిగ్గ నిస్సమం
చుం దగనూర్పులూర్చెదవు ఓ సుందర! స్వేదలవాప్తి ముంగురుల్
జిందరవందరయ్యె నికఁ జిక్కుడలించెదఁ దాళు మింతటన్.

(అని అట్లు నటించుచు ధ్యానచిత్త యగుచున్నది.)

కృష్ణు:—(చిఱునవ్వు నవ్వి) ఓహో! ఈపె యంతకంతకు ననురాగ చిత్తయై మఱింత వెఱ్ఱి దగుచున్నది; కాని భ్రాంతినుండి మఱలించుటకు చెలికత్తెయైనను సమీపమందు నుండఁగూడదా?

(తెరలో)

నిపుణికా! ఇప్పటి కీపూలు చాలును. పూజాసమయ మతిక్రమించుచున్న దేమో రాధ కిచ్చి రమ్ము.

కృష్ణు:—(విని ముందుకు చూచి, ఓహో! చెలికత్తియ యొర్తు పూజాపాత్రి నొకదానిని గైకొని యిటే వచ్చుచున్నది. ఇఁక జాగరూకుఁడనై మెలంగవలయును. (అని తత్ప్రయత్నమందు మగ్నుఁడగుచున్నాఁడు).

నిపు:—(పుష్పభాజనముగొని ప్రవేశించి తనలో) అదిగో రాధ యింకను ధ్యాననిమీలితాక్షియై కనుపట్టుచున్నది. పూజాసమయ మతిక్రమించినట్లు దోఁపదు. సమీపించెదఁగాక. (అని సమీపించి) నెచ్చెలీ! రాధా! ఈపుష్పాలను గృష్ణభగవానుని కర్పింపుము.

రాధ:—(వినవట్లు నటియించి) దేవా! నీదివ్యమంగళవిగ్రహమిప్పటికిగదా కనుగొంటిని. అట్టులేగదా!

చం॥ ఉరమున గౌస్తుభం బగణితోజ్జ్వలదీప్తుల రాజిలన్ బయో
ధరనిభగాత్రి పత్తపరిధానము మేను విలోల చంచలో
ద్ధురరుచి ముద్దుగొల్పఁ గనుదోయి సరోజయుగంబు నవ్వ ని
న్నరసితిఁగాదె యిత్తఱిఁ బ్రియా! సముదంచిత మోదమందుచున్.

నిపు:—ఇదేమి రాధ వెఱ్ఱిదై యాకాశహర్మ్యము నిర్మించుచున్నది. (పైకి) రాధా! ఇదేమే ఇంతవెఱ్ఱిదానవైతివి? కనులు మూసి నంత మాత్రమున గృష్ణుని వర్ణింపఁ దొడఁగితివేమి!

రాధ:—(తత్తఱబడి కన్నులుదెరచి) నెచ్చెలీ! కృష్ణుఁడేడి? ఇప్పు డిక్కడనే యుండెఁగదమ్మా! అయ్యో! ఇంతలో నేమయ్యెను? (అని సంభ్రమించుచున్నది.)

నిపు:—(తనలో) కృష్ణునియం దనురాగ ముదయించినది మొదలు రాధ యిట్టులే ప్రవర్తిల్లుచున్నది. ఏమిచేయుదును? ఇదిటులుండ శరీరము మన్మథానలమున మఱింత తపించి, వెచ్చనై, శుష్కిం చినను, గృష్ణస్మరణమాత్రము వీడ కున్నది. కానిమ్ము. ఇట్లు పలికి చూచెద. (పైకి)

తే॥ గీ॥ భూమిఁబొగడొందు పదునాల్గుభువనములను
దనదు కుక్షిని నందనందనుఁడు నిల్పె;
నట్టి మాధవు హృదయంబునంద నిల్పి
బాల! యీలీలఁ గృశియింపఁబనియ దేల?

కృష్ణు:—సెబాస్ చెలికత్తియ బాగుగ పలికినది. దీనికి మరల రాధిక యేమనునో?

రాధ:—(చిఱునవ్వు నవ్వుచు) ఎంత నంగనాచివే నిపుణికా! బాధకుఁ గారణ మెఱిఁగియు నావలన వినవలయుననియా నీతలంపు?

నిపు:—(తనలో) సరిపోయినది, ఇఁక నాలస్యముచేసిన బ్రయోజనము లేదు. (పైకి) సుందరీ! కృష్ణునిఁ దోడి తెచ్చెడి భారము నేనే కదా వహించినది.

కృష్ణు:—(సంతోషముతో) నే ననుకొనినట్లే యైనది. ఇప్పటికిగదా విన దగినమాట వింటిని; కాని బాధ యని రాధ వేఱే చెప్పనేల? శరీరస్థితియే చెప్పకఁ జెప్పుచున్నది. అట్టులేగదా?

చం॥ తనువు గృశింపసాగెఁ గను దమ్ములగాంతిఁ దొలంగె నందముం
గనఁబడదింతయేనియు ముఖద్యుతి వైకృతమందె మోవి, కెం
పునుఁ దొరఁగెన్ నితాంతము కపోలములుం జెలువంబువీడె, ని
స్సనుచును నూర్పుల న్నిగుడ నర్చన కై యిడుపూలువాడెడుం.

అయినను;

తే॥ గీ॥ సహజసౌందర్యరాశి యీ నఖయమేను
విరహావహ్నిపరీతమై బరగిచెలువుఁ
బాయకుండెను మలినంపు వసనమందుఁ
గట్టఁబడినట్టి రతనంబు కరణిఁ దలఁప.

(అని తనవంకఁ జూచుకొనిఁ) ఓహో! ఇం దాశ్చర్య మేము
న్నది? నాకును నట్టి యవస్థయేగదా!

తే॥ గీ కంఠహారమ్ముగాఁ దోఁచెఁ గంకణమ్ము
కటకముగ మారె ముద్దుటుంగరము నిపుడు
చెలఁగి యీనారి నారిగాఁ జేసి మదనుఁ
డకట! బాధింప నంగకార్శ్యంబు కతన.

నిపు:— నెచ్చెలీ! ఈపూలను గృష్ణభగవానుని కర్పింపుము. నే నేగి
యిప్పుడే వచ్చెద. (అని వెళ్లుచున్నది)

రాధ:—(వినుపించుకొనక మఱల ధ్యాననిమీలితాక్షియై) ఆహా!
యేమి! నాభాగ్యము. నాథా! నీ వింతదనుక నెక్కడుంటివి?
ఇంకను నన్ను బరీక్షింపవలయునా? అయ్యో! ఇప్పటివఱకు
నీకై వెతకి వెతకి వేసారితినే, మరల నెందులకు వచ్చితివి? నన్ను
బాధించుటకా? (కొంతవడి కుండి వినున ట్లభినయించి) నాథా!
యే మనుచుంటివి?

చం॥ దరహసితంబుమోవిపయిఁ దాండవముం సలుపంగ-"రాధ! ని
న్నరయఁగ వచ్చి తెంచు సముదంచితరీతి వచించె దార! సుం

దర భవదీయ వాఙ్మయసుధారసధారలు గ్రోలియుంటి బం
గరువువు లంది నీదు పదకంజము లర్చనసేతు నింతటన్.

కనుక నాథా! నాముద్దు సెల్లింపవలయును. (అని నిపుణిక యున్నట్లు భావించి) నెచ్చెలీ! ముద్దు వెదఁ జల్లెడు నాథుని యడుగుఁదమ్ములఁ బూజించి జన్మము సార్థపఱచుకొనియెద. ఇప్పుడు నీ వొక్కొక పూవందీయుచు నాకు సాయ మొనరింపుము. (అని కన్నులు దెఱువకయే చేయి సాఁచుచున్నది)

కృష్ణు:—ఓహో! రాధ మిక్కిలి వెఱ్ఱిదైనది. నే నీ సమయమును బోగొట్టుకొనరాదు. (అని సమీపించి) పూవు లందీయుచుఁ బ్రియురాలి కరస్పర్శచే విడుచుచున్నాఁడు)

రాధ:—(కన్నులు దెఱువకయే కోపముతో) పరిజనమున కింతటి బుద్ధి మాంద్యము దగదు.

కృష్ణు:—(చిఱునవ్వు నవ్వుచు) సుందరీ! పరిజనుఁ డీకృత్యమం దపరిచితుఁడగుటచేతనే బుద్ధిమాంద్యమునుఁ బొందఁగలిగెను.

రాధ:—(కన్నులు దెఱచి కృష్ణునిజూచి సంతోషముతో)ఆఁ! నాథా! మందభాగ్యురాలను సైరింపవలయును. నిపుణికయనుకొంటిని. (అని మెల్లఁగ లేవఁబోవుచున్నది.)

కృష్ణు:—(చిఱునవ్వు నవ్వి) సుందరీ! నీకీ తొట్రుపా టెందులకు?

రాధ:—(తనలో) ఆహా! ఏమి నాభాగ్యము? నే నిప్పు డెక్కడ నుంటిని? ఈ పులకాంకురము లేమి?

కృష్ణు:—(సంతోషముతో) ఇంక నాకేమి కావలయును? అయినను,

తే॥ గీ॥ వెలఁది! మన్మథశరముల వేఁడిసోకి
బడలియున్నట్టి నాకు నీ బాహులతిక
చల్లఁదనమిచ్చు ముత్తెంపుసరముఁబోలె
జీవదంబయి గళ మధిష్ఠించుఁ గాత!

(అని రాధిక భుజమును దనమెడపై వైచుకొని ఆశ్చర్యమున,
సుందరీ! ఇదేమి!

తే॥ గీ॥ ముదమొ సౌఖ్యంబొ దుఃఖమొ ♦ యెదియొ నాకు
దెలియఁగారాదు; కాని యిం♦ద్రియవికార
మసుఖ మొకదెస సుఖ మొక్క ♦ దెస నమర్చి
చకితునిగఁ జేసె నీభుజ ♦ స్పర్శకతన.

రాధ:—(తనలో) నాకు నట్లే తోఁచుచున్నది. (పైకి) ఆర్యపుత్రా! ప్రకృతిచేత గంభీరస్వభావుల రగు మీరును నిట్లు బలికెద రేల?

కృష్ణ:—సుందరీ! మితిలేని యానందము గలిగిన నేనిపుడు నీవాక్యముల చేత మఱింత ధన్యుఁడ నైతిని. అట్టులే గదా!

తే॥ గీ॥ క్లాంతజీవ ప్రసూనవి♦కస్వరములు
బ్రమద సంధాయకంబు లు♦ద్భటతమోని
రాకరణములు మదననిర్మాణచణము
లౌర వేయేల నీదువా♦క్యములు చెలువ!

రాధ:—(మాట తప్పించి) ఆర్యా! చెలికత్తియలు సయితము సమీపమున లేరు. నన్ను.........

కృష్ణ:—(అర్థోక్తియందే) పోనిమ్ము. ఈపరిజనున కేమి నియోగింపఁ దలఁచితివి?

రాధ:—(లజ్జతో) పూజనీయులైన వారియెడ నపరాధ మొనరింప నిచ్చగింపను. ప్రేమప్రసన్నము లగు నీచూపు లీదీనురాలిపైఁ బ్రసరించినఁ జాలును.

కృష్ణ:—కాని, రాధా! నీకృష్ణభగవానుని నేనుగూడ బూజింపవచ్చునా?

రాధ:—(చిఱునవ్వు నవ్వి) నిన్ను నీవే పూజించుకొనియెదవు గాఁబోలు! (కొంచె మూఱకుండి) నే నంతమాత్ర మెఱుఁగక పోలేదు. బేలనైన నన్ను మఱింత జాలిన సేయుచున్నాఁడవు. నన్ను బోవనిండు.

కృష్ణు:—(చిరునవ్వు నవ్వి) దేవీ! అంత తొందర యెందులకు? అటులనే వెళ్లెదవుగాక.

రాధ:—ఎప్పుడు.

కృష్ణు:—ఎప్పుడా? నిన్నొకమారు ముద్దుపెట్టుకొనిన పిదప. (అని అట్లు చేయఁబోవుచున్నాడు.)

రాధ:—(నివారించుకొనుచున్నది)

(తెరలో)

ఉ॥ ఓసి! దురాత్మురాల! మది నొక్కరవంత భయంబు లేక వి
శ్వాసముపీడి మానుష ము వాసి కులంబును బాడొనర్చి క
ట్టా! సరివారు నవ్వఁగ విటపరికరంబులఁ గూడి నాదు పే
ర్వాసితొలంగఁ జేయఁదగవా! కసిదీర దె నిన్ను ద్రుంచినన్.

రాధ:—(విని భయపడి) ఆర్యపుత్రా! ప్రవర్తన దుష్టమైన దని తలఁచి కాఁబోలు నా తండ్రి క్రోధతామ్రాక్షుఁడై యిటే వచ్చుచున్నాఁడు. సందియము లేదు. కొంతవడి ఆర్యపుత్రుఁడు రసాలవృక్షమును జాటుజేసికొని దాగియుండవలయును.

కృష్ణు:— అట్టులే. (అని దాగుకొనుచున్నాఁడు.)

రాధ:—(మరల కృష్ణవిగ్రహమును బూజించుచుండును.)

వృష:—(పూర్వోక్త పద్యమును బఠించుచు, రాధపై దుముకఁ బోవుచున్నాఁడు.)

రాధ:—(పూజ చాలించి తండ్రిపాదములక్రిఁద వ్రాలి) తండ్రీ! నా యపరాధములను సైరింపవలయును.

వృష:—(కోపముతో) ఓసీ! కులట! దూరముగ నుండుము: (అని విదలించుచున్నాఁడు.)

రాధ:—(లేచి దూరముగఁ జని) కన్నబిడ్డల నిట్లవమానపఱుపఁ దగునా? తండ్రీ!

చం॥ కులటన తండ్రి! యిట్టు లనఁ గోరిక పుట్టెనె కన్నబిడ్డలన్
గులట లటంచుఁ ద్వాదృశులు ♦ గోవిదులాడెడి పల్కులే, కటా!
కులటలెసుమ్ము రుక్మిణియుఁ ♦ గొండలరేనికుమారి గౌరియున్
గులటలు కానివా రెవరు! ♦ గొండలపాటు వహింప నేటికిన్.

వృష:—ఓసీ! దౌర్భాగ్యురాలా! నాకు నీతు లుపదేశించు దానవా? నీవు చెడుటయే కాక రుక్మిణీపార్వతుల సయితమునీసామ్యముచేఁ జెఱుపఁజూచుచున్నదానవు. పనికిమాలిన యాకృష్ణునితోడి సాంగత్య మొనరించి సాటివారలలోఁ దలవంపులు గలిగించినది చాలక ఇంక నోరెత్తెదవేల?

కృష్ణు:—ఇతఁడు చూడ వట్టి మూర్ఖుఁడువలెఁ గన్పట్టుచున్నవాఁడు.

రాధ:—(కొంచెము కోపమున) తలవంపులా! తండ్రీ! తలవంపులా! సకలాంతర్యామి యగు కృష్ణభగవానునిఁ బూజించుటయుఁ దలవంపులా! అటులైన నీ సూర్యచంద్రు లుండుటయుఁ దలవంపులే! త్రిమూర్తు లుండుటయు దలవంపులె! భూమ్యాకాశాది పంచభూతములును దలవంపులు గలిగించునవియె. ఇంతయేల? నేను నీకుదయించుటయుఁ దలవంపులే!

కృష్ణు:—సెబాస్! రాధ తనశక్తియంతయు నిచటనే వెల్లడించుచున్నది; కాని బొమముడిమాత్ర మెంతయో ముద్దుగొల్పుచుఁ జూపరుల హృదయంబు సయితము చూరఁగొనుచున్న నీపె సౌందర్య మద్వితీయము.

వృష:—(తనలో) రాధ యంతకుఁ దగినదియే! (కొంచె మూరకుండి) ఒక్క రాధ యననేల? స్త్రీజాతికంతకు నైజగుణ మింతియే గదా! నాఁడు;

తే॥ గీ॥ ఇచ్చకవు మాటలాడి ని♦న్నే వరించి
తంచు బలుకు పరాశరు ♦ నవుడు దాశ

రాజనందని కూడదే రహిఁ దొలంగి
సుందరుల నెందు నమ్మ వచ్చునె తలంప.

పోనిమ్ము. ఏది యెట్లున్నను నావంటివానికి;

చ॥ పొలఁతులు బుట్టుటేల? సరి పుట్టిరి పో, మృతిజెంద కిమ్మహిన్
జెలఁగు టదేల, జీవమును జెందిరి పో, కులశీలగౌరవం
బులఁ జెలు వొంది సద్యశముఁ బొందరదేల? తలంప నాఁడుబి
డ్డలు గలయట్టి వార లకటా! సుకృతాత్ము లనంగఁ జెల్లునే?

కానిమ్ము. సామవచనంబుల రాధను నీ ప్రియత్నమునుండి మఱలింపఁ జూచెదఁగాక. (పైకి) బిడ్డా! ఇతనిని బూజించు టెందులకు?

రాధ:—(గంభీరమున) పూజనీయు లెందును బూజింపబడుచుందురు. పెక్కు లేల? ఇతఁడే నాప్రియుఁడు.

కృష్ణు:—(సంతోషమున) సెబాస్. నాకుఁ బ్రియ మగునటులనే రాధ వచించినది.

వృష:—(విరక్తిభావమున) కట్టా! ఎట్టి పని చేసితివి?

ఉ॥ ఎంతటి వెఱ్ఱిదానవె యిసీ! యదునందనుఁడా ప్రియుండు? నా
గొంతుకఁగోయ నెంచితివె? కూఁతుర! లోకులు నవ్వరే కటా!
సుంతయెఱుంగ వీ వతఁడు జుట్టుకు జుట్టుకు ముళ్ళు వెట్టి తా
వింతలుజూచు జారుఁ డవివేకి కదే, యిదిగాక, చోరుఁడే!

చోరు డెట్లని వచించెదవేమో?

మ॥ మొన మొన్నన్ వ్రజకాంత లెల్ల వసనంబుల్ తీరమందుంచి వే
డ్కను గాళింది జలంబులన్ జలకమాడంబోవ నీచోరుఁ డం
తను జౌర్యక్రియఁ జీరలన్ గొనుచు బున్నాగం బధిష్ఠించి వా
రిని, బాధించిన మాయకాఁడుగదె పుత్రీ! నీకు నాథుం డఁటే!

కృష్ణు:—ఇతఁడు న్యాయం దరుచిగలుగు నట్లు రాధ కేదియో యుప దేశించుచుండెను. ఇప్పుడు రాధ ఏమనునో వినెదనుగాక.

రాధ: —(గంభీరముగ) తండ్రీ! తెలియనివారివలె మాటలేల పలుకు చుందురు. మీకెదురాడుదాననుగాను. అయినను భగవంతుని గుణములను గీర్తించుటయందుఁ దప్పేమి యుండును?—కాని;

ఉ॥ "హా! యదునందనా! మురహరా! మధుసూదన! విశ్వరూప! రావే" యని దీనతన్ బడి కరీంద్రము వల్కఁ బులకాలకించి "హా హా" యనుచున్ దటాలునను హాపవకృతిన్ మొసలిన్ విదల్చి చక్రాయుధ మంది, హస్తిని రయంబున బ్రోచిన యాతఁ డల్పుఁడే? ఇదిగాక

ఉ॥ పెక్కులిఁకేల? తాలుగురిపించిన యప్పుడు గొల్లవారలన్ మక్కువఁ జేరి గోపకులమాన్యుఁడు బేరెలుగెత్తి "యెందుకీ చిక్కుల నొందఁ జూచెదరు? చిక్కడలించెదఁ జూడు" డంచుఁ దా గ్రక్కున మున్ను శైలము నఖంబున నిల్పఁడె? నీవు సూడవే?

తండ్రీ! ఎందులకీ కంఠశోష. కడసారి పలుకు వినుము. ఇది యే నాప్రతిజ్ఞ!

చం॥ అమలచరిత్ర! చంద్రిక హిమాంశునిఁ బాసినఁ బాయుఁగాక దుర్విమలత ఛాయ భాస్కరుని వీడిన వీడునుగాక, మించు మేఘమును దొలంగినం దొలఁగు గాక మదీయమనోగతుల్ లస ద్విమలచరిత్రుఁ కృష్ణు నిఁక వీడఁగనేర్తునె వేయి సెప్పినన్?

కృష్ణు:—(ఆశ్చర్యమున) ఔరా! సత్యమైన ప్రేమ యన నిట్టిదే కదా కాని నిర్భయముగాఁ బలికిన నీముద్దియపలుకులకుఁ గోపించి యీమూర్ఖుఁ డేమిచేయునో తెలియకున్నది?

వృష:—(కోపముతో) ఓసీ! చెనటీ! ఈదుర్మార్గుని నీ వాకవేళ వీడకున్నను నిన్నితఁడే విడచునట్లు చేసెదఁ జూడుము. (అని కృష్ణ విగ్రహమును దీసి పొదరింటి గోడకుఁ గొట్టఁబోవుచున్నాఁడు.)

కృష్ణు:—ఓహో! ఇతని మూర్ఖత యంతకంతకు మితిమీరుచున్నట్లున్నది. తప్పక యిప్పుడే ఫల మనుభవింపఁగలడు,

రాధ:—(నివారించి) తండ్రీ! శాంతించుము. నీకుఁ గోప ముండిన గృష్ణుని నెమర్కొనవలయును గాని యీ శిలావిగ్రహమును బ్రద్దలు గొట్టనగునా? అటులేని తొలుత నాతలఁ బ్రద్దలుగొట్టి పదంపడి నీ యిచ్చవచ్చిన ట్లొనరింపుము. (అని తండ్రి సమీపమునకు వచ్చి కన్నీరు విడుచుచున్నది )

వృష:—ఓసీ! మాయలాడీ! ఈమాయలు నాకుఁ దెలియునివి కావు. పొమ్ము. ఆవలకుఁ బొమ్ము. (అని దూరముగా నెట్టి విగ్రహమును గోడకుఁ గొట్టఁగాఁ నది గోడ కంటుకొనిపోవును. మరల యథాస్థానమున విగ్రహ ముండును. వృషభానుఁడును మాటిమాటికి గోడకు విసరుచుండును)

రాధ:—(చూచి సంతోషమున తనలో) నాథా! నీలీల లనంతంబులు గదా! ఇట్టి పరాత్పరుఁడ వగు నిన్ను మాతండ్రి తెలిసికొను టెట్లు? (ఎదుటఁ జూచి)నినువుఁ జెందక చేతులు సడలు వడుచున్నను బట్టుమాత్రము విడువక మాతండ్రి నిన్నెట్లు బాధించుచుండెను? అయ్యో! నీశరీరమున కెంతటిబాధ కలుగుచున్నదో కదా! నాథా! ఏమిచేయుదును? ఎట్లు సహించెదను? అని కన్నీటిని చేలాంచలమున దుడుచుకొనుచున్నది.

వృష:—(కోపముతోఁ జేతులు నలుపుకొనుచు) ఓసీ! ఇతఁడు వట్టి మాయకాఁ డని మున్నె వచించితిగదా? యేల మోసపోయితివి? ఇప్పటికిఁ దెల్లమైనదా? చాలు చాలు. ఇఁక నింటికి నడువుము. (అని బలవంతముగా దీసికొని పోవుచున్నాఁడు.)

రాధ:—(తనలో)నాథున కవమానముఁ గలిగింపఁ బోయిన నితఁడే యవమానమును బొందెను. కఠినహృదయుల చిత్తవృత్తు లిట్టు లుండుగాఁబోలు. (కొంతవడి యూరకుండి) హృదయమా! నీ తెలివి తెల్లవారిన ట్లున్నది. ఏ మనిన? తొలుతనే సులభముగ లభించిన నీమనోరథ సిద్ధికి భంగము గలిగించు కొంటివి. ఎట్టి

వెఱ్ఱిపని చేసితివి? ఇప్పుడూరక చింతించిన లాభమేమి కలదు? (అని రెండడుగులు ముందుకు వైచి,) ఓకృష్ణవిగ్రహామా! మరల నింకొకసారి నీముద్దు మొగంబును గనంబఱచితి వేనిమిక్కిలి సంతసించెద. (అని కన్నీటిని దుడుచుకొనుచుఁ దండ్రితో నడచుచున్నది.)

కృష్ణు:—(పూర్వ ప్రదేశమునకు వచ్చి నిట్టూర్పు పుచ్చి) అయ్యో! పానకములోని పుల్లకైవడి కార్యసిద్ధి కెన్నియో విఘ్నములు వాటిల్లుచుండును అట్టులేగదా!

ఉ॥ చిత్తజి వాలుచూపుల వింభీతమ్ము గేక్షణ లేత కెంపుఁ ద
ళ్కొత్తెడి వ్రేళ్లతో నధర ♦ ముద్దిక గప్పుచు మెల్ల మెల్ల'' నీ
కిత్తఱిఁ గూడ'' దంచు వచి♦యించుచు మూపునఁజేర్చియున్న మో
మెత్తియు ముద్దువెట్టుట కి♦సీ! వెను కాడితి వెఱ్ఱివాఁడనై.

అయ్యో! మరల నాప్రియురాలి తోడి సాంగత్య మెన్నటికో తెలియకున్నది. పాప మాయబల చనుచున్న ప్పుడు నన్ను విడువలేక తుదకు ఓకృష్ణవిగ్రహామా! మగిడి నీదర్శన మెన్నడో కదా యని కొంగి పొరలివచ్చెడి కన్నీటిని చేలాంచలమున నొత్తుచు, జనకుని యప్రియాలాపములకు మిగులఁ జింతించి, భయఁపడిన మృగశాబకము బోయవాని ననుసరించిన తెఱంగున, విధిలేకఁ దండ్రితోఁగూడఁ జనినది. ఇయ్యది నాహృదయమున పెద్దగాయమై వేధించుచున్నయది. ఏమి చేయుదును? (అని మోహమును వహించుచున్నాడు)

(తెఱలో)

ఓ మదించిన కోదమ తుమ్మెదా! నీ వచ్చటచ్చటఁ బూదే నియలు గ్రోలి తృప్తి వహించినను నీసహచరి మాత్రము దప్పికఁ గొన్నదగుట నీవులేనిదే మకరందము సయితమానక నీజాడ కెదురు చూచుచున్నది. ఇప్పటి కైనను రమ్ము.

కృష్ణు:—(విని) ఓహోహో! ఇవి పద్మిని మాటలుగాఁ దోఁచుచున్నవి. ఈమె పరులచెంత నేను రాధికను వరించితి నని ప్రలాపించుచున్నది. నిశ్చలమగు ప్రేమతత్త్వ మాదాసిపుత్రి కెట్లు దెలియును? అయినను పద్మిని సామాన్యురాలు కాదు. సత్యయన్నను నింతకు మించినదియే. (అనినడచుచున్నాఁడు) (తెరజారును.)

ఇది తృతీయాంకము





శ్రీమత్పరదేవతాయై నమః.

# కల్యాణరాధామాధవము.

## చతుర్థాంకము

(రంగము ఒకవీధిభాగము :—అంత పత్రికఁగొనిసత్యభామ పరిచారికయగు కమల ప్రవేశించుచున్నది.)

కమ:—(ఆశ్చర్యముతో) ఔరా! కాలమహిమ! పద్మిని, చెలికత్తె యైనను యిప్పుడు రాణిగాఁ బరిణమించినది. ఏమనిన నింతకుఁ బూర్వమే నన్నుఁ బిలచి—"కమలా! కృష్ణునిచే లిఖింపఁబడిన యీ కమ్మను గొనిపోయి రాధకిడి శీఘ్రముగ నామె నిక్కడకు వచ్చునట్లు చేయవలెను సుమా!" యనిచెప్పుచు నాచేతి కీయుత్తర మిచ్చెను. అంతట దురదృష్టురాలనగు నేను "పద్మినీ! ఈదినము దేమని వేడుకకలదా!"యనియడుగ నాపెమొగము జేవురించుకొని "ఓసీ! తొత్తుకూతురా! పొమ్మనినఁ బో వలదా!" అని గద్దించి పలికెను. (కొంచెమూరకుండి) కానిమ్ము యెవ రేది చెప్పినను జేయవలయును గదా! ఇంతకు దాస్య వృత్తి యట్టిదియ.

తే॥ గీ॥ కష్టభరితమ్ము నిర్ధాత • గౌరవమ్ము
భయద దురితాకరమ్ము సం•ప్రాప్త చటుల
దురభిమానమ్ము స్వచ్ఛంద • విరహితమ్ము
జీవితాపహ మీ దాస్య•జీవనమ్ము.

(అని యెదుటఁ జూచి)

ఆహా! ఏమి! ఈసాక్షాత్కారము! మదనుఁడు నిశితములగు శరపరంపరల నలయించినను సానఁబెట్టిన రతనంబు కరణి ముద్దు గొలుపుచున్న పూజ్యుఁడగు కృష్ణభగవానుఁ డిటేవచ్చు చున్నవాఁడు దర్శించెదఁగాక —

(అంతటఁ బైనఁజెప్పఁబడిన విధమున కృష్ణభగవానుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

కృష్ణు:—ఓయీ! మన్మథుఁడా! నీప్రభావము కడుంగడు ప్రశంస నీయమైనది. ఏమందు వేని?

చం॥ కనలుచుఁ బూవువిల్లుగనుఁ గైకొని స్త్రీజనవీక్షణాళి మా
ర్గణములుగాఁ దనర్చు భ్రమరప్రకరంబటు నల్లెతాలుగా
నొనరిచి మూర్ఖుఁడైన శశియుక్ జెలికాఁడయి సాయమేర్పడన్
ననవిలుకాఁడ! నీవిఁక నశినంగుఁడవై జగమెల్లఁ గాల్చెదే!

(అనితలపంకించి) ఓరీ! నీమురుగ మిప్పటికైనను మాన వుగా!

చం॥ అరయ శరీరమేని యు బరియఁబడ దితకు బూవుటమ్ములన్
బఱపుచు నిక్కుచుండెదవు పల్మరు మూఁడుదోడుఁగాఁగ; నీ
గరువ మడంతులెమ్ముగ చెలఁగా! మదినంతస మందె చెల? సుం
దరి రమణీయవీక్షణ వితాన నిశాతశిలీముఖంబులన్.

(కొంతవడి యూరకుండి) ఏది యెట్లు లున్నను తండ్రి కఠోర వాక్యములకు దిగులొందిచేయునది లేక యనుసరించి వెంటఁజనిన రాధిక నింకెన్నఁడు కనుగొందునో తెలియకున్నది. (అని యొక ప్రక్కఁజూచి) ఓహో! పరిచారిక కాఁబోలు యిటేవచ్చు చున్నది.

కమ:—(ప్రవేశించి) దేవా! జయము, జయము.

కృష్ణు:—(ఆశ్చర్యముతో) ఎక్కడ కేగుచుంటివి?

కమ :—రాధాదేవికడకు.
కృష్ణు:—ఎందులకు ?
కమ :—రాధాదేవి నిటకుఁ దోడ్కొనివచ్చుటకు.
కృష్ణు :—కారణ మేమిదియో యూహించితివా ?
కమ :—లేదు.
కృష్ణు :—పోనిమ్ము — ఎవరిపంపునఁ జనుచుంటివి ?
కమ :—అమ్మగారు చెప్పిరని పద్మినిచెప్పఁగా బోవుచుంటిని.
కృష్ణు :—(నవ్వి) ఓహో ! అటులనా ! అయినఁ బోయిరమ్ము.
కమ :—చిత్తము (అనివెళ్ళుచున్నది.)
కృష్ణు :—(ఆశ్చర్యముతో) ఔరా ! ఇందేదియో మోసమే జరుగనున్నది. (అని కొంతవడి విచారించి తలపంకించి) కానిమ్ము. ఏది యెట్టులున్నను;

తే॥ గీ॥ సుదతి కొదవిన కష్ట మం యేదియె నాకుఁ
దనరు ; నాకబ్బు ముప్ప రాధకు ఘటిల్లు
గాదె ; మాకిర్వురకు భేద మేది కలదు.
కృష్ణుఁడే రాధ ; రాధయే కృష్ణుఁ డరయ.

(ఇది విష్కంభము)

(రంగము:— యమునాతీరమందొక పొదరిల్లు. అంత సత్యభామ శిలావేదికపై నాశీనయై విచారించుచు ప్రవేశించుచున్నది.)

సత్య :—అయ్యో ! తుదకు నా కెట్టిగతి పట్టినది ! స్వర్గసుఖము సయితము మరపింపఁజాలిన నాథునికౌఁగిలి నాకిప్పుడు దూరమయ్యెను. ఊహలన్నియు నాకాశమున నిర్మింపఁబడిన దుర్గములగుచున్నవి. పెక్కులేల ! ధవుఁ డాదరింపనివత్సమున సతి జీవించియున్నను, మృతప్రాయమేకదా ! కాని

తే॥గీ॥ ధవుని మెప్పు వహించు సుందరివిలాస
మెంతయు ఫలంబునొందుఁ గాదేని దానఁ

దోడరు జరితార్థ మెద్ది ? కాఱదవిఁ గాయు
వెన్నెలను గాంచి యెవ్వాఁడు ♦ వేడ్కఁ జెందు?

కట్టా! పద్మిని చెప్పిన దంతయు వాస్తవమైనది. రూపమదంబున గర్వించిన నే నపుడు చెలికత్తియను సయితము నిరాకరించి యిప్పు డధోగతి పాలైతిని. ఏది యెట్టులున్నను;

ఉ॥ ఎక్కడనుండి వచ్చె నను ♦ నేచుట కీ వగలాడి రాఁ? పె
న్మక్కువతోడఁ జేరి—"యెలనాగ! సుధారస మానసీయు" మం
చక్కట! మోవి నొక్కుచు ము♦దంబు వహించెడి నాథుఁడిప్పుడీ
టక్కరి రాధగేహనిక♦టంబుదొలంగఁడి దేమిపాపమో?
పెక్కులేల?

చ॥ ఒక నిముసంబు నన్విడువ ♦ నొల్లఁడు మాఱుమొగంబువెట్ట "న
న్నిఁక నెడఁబాసెదే" యనుచు ♦ నెంతయువేడెడుఁ బల్కకున్న "నో
వికచసరోజనేత్రి! ముఱి♦పెంబున కేని వచింపు"మంచు నిం
చుకబ్రతిమాలుచుం బలుకు ♦ సుందరుఁడే నను వీడె రాధకై.

ఔరా! మిక్కుటమగు మోహమున నాథునిచే లాలింపఁ బడుచున్న నే నిపుడు పనికిమాలినదాననై మెలఁగవలసి వచ్చినది. (విచారించి) ఇం దేదియో రహస్యముండి తీరవలయును.

ఉ॥ మాయలుసేసి నాథునకు ♦ మందులువెట్టిరో, యేమొ కాని న
న్మాయ యొనర్చి కాంతుఁ డవ♦మానము నొందఁగ రాధకౌఁగిటం
రేయిబవళ్లు వాసమొన♦రింపఁగ నెంచె మదీయభాగ్య మి
ట్లాయె విచార మేటికిఁ ద♦లంప సపత్నుల నమ్మవచ్చునే?

(తెరలో)

నెచ్చెలీ! వాస్తవము. సపత్నుల నెందును నమ్మఁగూడదు.

సత్య :—(విని) అదిగో పద్మిని వచ్చుచున్నది. నాథునిఁ దోడితెచ్చుట కేదియేని యుపాయ మొనరించునేమో!

(ఇంతలో పద్మిని మరల నదియే పఠించుచు బ్రవేశించుచున్నది.)

సత్య :—(చిఱునవ్వు నవ్వుచు) పోనిమ్ము. పద్మినీ! చెలికత్తియల నమ్మవచ్చునా?

పద్మి :—(నవ్వి) చెలికత్తియల నమ్ముకొని చెడినవా రెవ్వరమ్మా!

సత్య :—నేను లేనా?

పద్మి :—(స్మృతి నభినయించి! ఓహో! ఇదియా! నాథునిప్పుడే తోడితెచ్చెదనమ్మా! ఇంత నిష్ఠూర మెందులకు?

సత్య :—నీకు సాధ్యపడినప్పటికిఁగదా!

పద్మి :—మఱి యెవ్వరికి సాధ్యపడును? కృష్ణుఁడు నీయొద్దకు వచ్చి నప్పుడే నా సామర్థ్య మెఱిఁగెదవు లెమ్ము.

సత్య :—(నవ్వి) కృష్ణుఁడు రాకున్నమానె, రాధాకృష్ణులకు భేదము గలిగించినప్పటికిఁగదా నాకు సంతసము.

పద్మి :—(తనలో) ఓహో! నెచ్చెలికూడ నామతమునే యవలం బించినది. ఇంక నా కాయాస మెందులకు? (పైకి) అట్లులె— సఖీ! నే నేగి యమునందనుని నీసమీపమునకు వచ్చునట్లు జేసెద. సమ్మతించెదవా?

సత్య :—(చిఱునవ్వునవ్వి) చెలీ? సామర్థ్య మెఱుఁగకపోలేదు. ఈ తారహారమును గొని నీ యిచ్చవచ్చినట్టు లొనరింపుము పోయిరమ్ము.

పద్మి :—(తనలో) ఇంకేమి నాకార్యముసానుకూలమైనది. (పైకి)ఇఁక నన్నుమఱచెదవుగాఁబోలు (అనిచిఱునవ్వుతో నడచుచున్నది)

సత్య :—(తనలో) పద్మిని యంతకుఁదగినదియే. కాని యార్యపుత్రుఁ డీపెకు సాధ్యపడునట్టు తోఁచదు.పోనిమ్ము; మైత్రేయుని స్వయముగ నేనే పిలిపించి విచారించెదఁగాక (అని వెనుకకుఁ దిరిగి చూచి) ఓహో మైత్రేయుఁ డిచ్చటనే చోరునిపగిది నాచిత్తవృత్తిఁ గనిపెట్టుచు నీ సోదరింటి మఱుఁగుననే దాగియుండెను.

ఔరా! ఎట్టిపరిమాద మందితిని (అని పైకి) మైత్రేయా! మైత్రేయా! ఇటు రమ్ము. (కొంచెమూరకుండి) ఔరా! ఇతఁ డెంతటి కపటశీలుఁడు? నామాట వినినతోడనే మెల్లఁగా నొక ప్రక్కకు నడచుచున్నవాఁడు (అని మరల చూచి) కాదుకాదు. నేనే పొరఁబడితిని; కాని భయముచేత నెంతయో త్తరపడు చున్నట్లుఁ దోఁచెడిని. అట్టులేగదా!

తే॥ గీ॥ జారుచుండిన యంగవస్త్రంబు బుజము
మీఁద సిదుకొంచు సారెకుఁ ♦ బాదయుగము
దొట్రుపడుచుండ దేహము ♦ దూల, నితఁడు
గడుభయంబున రా నేమి ♦ కారణంబొ!

(అంతటఁ బైనఁ జెప్పఁబడిన విధమున మైత్రేయుఁడు ప్రవేశించి)

విదూ:—అక్కటా! ఎట్టి దురవస్థకుఁ బాలైతిని.

చ॥ పికపికలాడుచున్ పిగిలి♦పిట్టతెఱంగున మెల్లఁ బారుచున్
బెకబెకలాడుచున్ గనలి ♦ బెగ్గిలు కప్పగతిన్ జరించుచున్
జకచకలాడుచున్ నుదులు ♦ చక్కఁగఁ బల్కుచు మెల్లఁజేరుచున్
బకపకలాడు చ వ్విధిని ♦ బద్మిని బ్రాణముతోడ వీడదే!

ఇప్పు డందులకుగూడ నోఁచుకొననైతినేమో తెలియకున్నది. (అని సమీపించి "దీర్ఘసుమంగలీ భవ" అని యాశీర్వదించుచున్నాఁడు.)

సత్య:—(నవ్వుచు) మహాబ్రాహ్మణుఁడా! ఇటు కూర్చుండుము. ఇంత భయఁపడుచుంటి వెందులకు?

విదూ:—(తనలో) ఈయమ్మ సామాన్యురాలుగాదు. ఆవలించిన బ్రేవులు లెక్కపెట్టునంతటి నిపుణిక. ఒకప్పుడు కృష్ణుఁడు నయితె మీాపెను వెరచుచుండును. ఇఁక నావంటివానిమాట

చెప్పనక్కఱయేలేదు. (పైకి) తల్లీ! ఏమియులేదు. ఏదియోచిన్న
నాటిముచ్చట స్మృతికివచ్చినాశరీరమట్లు భయకంపితమయ్యెను.

సత్య :—పోనిమ్ము. మైత్రేయా! నీవేమక చెలికాఁడు నిన్నువిడచి
యొక్క నిముషమేని యొంటిగ నుండఁడుగదా!

విదూ :—కావచ్చును. అయిననేమి?

సత్య :—ఏమియులేదు. ఇప్పుడు నిన్నువిడిచి యుండెనేమి అని.

విదూ :—(తనలో) ఓహో కృష్ణుని వృత్తాంత మరయుటకుఁ
గాఁబోలు నిట్టు మాటాడుచున్నది. (పైకి) అతని కెన్నియో
పనులుండియుండవచ్చును.

సత్య :—బృందావనమందుఁ గాఁబోలు.

విదూ :—(మిన్నకుండును)

సత్య :—మైత్రేయా! నీకు రాధికావృత్తాంతము దెలియునని యూ
హింతును. నిజ మగునా?

విదూ :—తెలియదు.

సత్య :—(చిఱునవ్వు నవ్వి) నీ వతని చెలికాఁడవుకాదా!

విదూ :—అయిననేమి? పరాభిప్రాయమును దెలిసికొనునంతటి చాక
చక్యము మృత్పిండబుద్ధి నగు నాకేమి తెలియఁగలదు. ఇంత
కును జిత్తవృత్తులు విచిత్రరూపములుగదా!

సత్య :—పోనిమ్ము. మైత్రేయా! నీ విక్కడి కేలవచ్చితివి?

విదూ :—రావలదని యింతవర కెవ్వ రడ్డగించని కారణమున వచ్చి
తిని.

సత్య :—(నవ్వి) వెఱ్ఱిబ్రాహ్మణుఁడా! అదికాదు. నీ వెవ్వరిపంపున
వచ్చితివి అని.

విదూ :—తల్లీ! నే నెవ్వరికిని సేవకుఁడగాను. నాకు నేనే ప్రభువును.
న న్నెవ్వఁడును బంపలేదు.

సత్య :—(కొంచెము కోపముతో) నీప్రలాప మంత కంతకు మితిమీరు చున్నది. ఇప్పటికైనను వాస్తవ మెఱిఁగింపుము.

విదూ :—(తనలో)కృష్ణుఁడు ప్రాతఃకాలమున నన్నుబిలిచి'వయస్యా! సత్యభామ చిత్తవృత్తి గనిపెట్ట వలసినదని నాతోఁజెప్పి ని చ్చోటికి వచ్చితిని. ఏదియెట్టులున్నను వాస్తవ మెఱిఁగింపఁ గూడదు. అంతకును కృష్ణుఁడే కలఁడు. (పైకి) తల్లీ! యమునా తీర మందు విహరించుటకు కృష్ణుఁడును నేనును నీవైపునకు వెడలి తిమి; కాని నాదురదృష్టవశమున నతఁడు దోవతప్పి యెటకో చనియెను. అతనిని వెదకికొనుచు నీ సౌధరింఢ్లయందు సంచ రించుచుంటిని.

సత్య :—ఇదియంతయు సత్యమగునా?

విదూ :—ఇక్కడ సత్యమాడువా రెవ్వరు?

సత్య :—(కోపముతో) ఛీ! ఛీ! మూర్ఖా! ఆవలకుఁబొమ్ము. ఇప్పుడే నీ సత్యము దెల్లము కాఁగలదు.

విదూ:—రాజు తలఁచుకొనిన దెబ్బలకు గొదువా? తల్లీ!

సత్య:—(వినుపించుకొనక కోపముతో) కమలా! కమలా!

కమ:—(తొందరతో ప్రవేశించి) ఇదిగో వచ్చితిని. అనుజ్ఞయేమి?

సత్య:—ఈ యసంబద్ధప్రలాపియగు మైత్రేయుని బంధించి కారాగార బద్ధునిఁ జేయుము పొమ్ము.

కమ:—చిత్తము. అట్టులే (అని వెళ్లి పోవుచున్నది.)

మైత్రే:—(వెళ్లఁబోవుచున్నాఁడు)

కమ:— (త్రాడుతోఁబ్రవేశించి కట్టుచుండును.)

మైత్రే:—(కట్టునడి) ఓసీ! తొత్తుకూఁతురా! నీ వింత సిగ్గుమాలినదాన వైతివేమి? (చేతులు పైకెత్తి) కృష్ణా కృష్ణా! మాంరక్ష, మాంరక్ష.

ఉ॥ ఈకఠినాత్ముకరాలు మనికెంతయు లజ్జ వహింప కివ్విధిన్
బ్రాకట వైభవోద్ధతినిఁదారటను గట్టెడు, నాఁడు జీవురున్

జేశాని తొత్తుకూఁతు రటు చేసిన భంగము చాలదొక్కొ రా
వే! కరుణింపవే! తలఁపవే మిఁక నీకును భార మైతినే!

(తెరలో)

వయస్యా! భయఁపడకుము; భయఁపడకుము. ఇదే వచ్చుచున్న వాఁడ.

విదూ:—అమ్మయ్యా! చెలికాఁడి టే వచ్చుచున్నవాఁడు. ఇఁక నీకి మలపని పట్టించెద,

పద్మి:—(పైనఁజెప్పఁబడిన విధమున కృష్ణవేషమున పై వాక్యము పఠించుచు బ్రవేశించి) వయస్యా! నీ కీదుర్గతి యేమి? ఎవరు కల్పించిరి? (అని బంధములు విప్పుచున్నఁడు.)

విదూ:—(కనుసన్నచే సత్యభామ వంక జూపు చున్నాఁడు.)

సత్య:—(నవ్వుచుండును)

పద్మి:—(చిఱునవ్వు నవ్వి) వయస్యా! తరువాత విచారించెదను. ముందుగా నీకుగలిగించిన పరాభవమునకు ప్రతీకార మీమాధవుఁగనే యొనరింపుము. ఇఁక నీకు భయ మెందులకు?

కమ:—(మెల్లఁగా వెడలఁబోవు చుండును.)

విదూ:—(కోపముతో) ఓసీ! తొత్తుకూఁతు రా! ఎక్కడికి కేగెదవు?

చం॥ నిలునిలు మోసి రక్కసి వసిం జరియించినయంతమాత్ర నక్కదులువ యటంచు నెంచితె కనుంగొను మింతట నాప్రభావముల్ నలుఁడు శిరోజముల్ గొని వినమ్రిత ద్రౌపది నీడ్చినట్లు నీ కులుకుమిటారి గబ్బిచనుగుట్టలు గంతులిడంగ నీడ్చెదన్.

(అని వెంబడించుచున్నాఁడు)

సత్య:—(చిఱునవ్వు నవ్వి) ఔరా: ఏమి వీని పాండిత్యము!

పద్మి:—ఇంతదనుక సత్య నాకై యెదురుసూచుచున్నది కాఁబోలు. సమీపించెదఁగాక (అనిసమీపించి) కల్యాణీ! శుభం బగుఁగాత

సత్య:—(ఎత్తిపొడుపుగా) అనుగ్రహింపఁబడితిని. ఆర్య పుత్రా! మీరాధకూడ వచ్చుచున్నదా? పాప మా ముద్దియ యొంటరిగా నుండలేదు గాఁబోలు.

పద్మి:—సుందరీ! యెట్టులో రాధను విడచితిని; కాని యీపెమాత్రము కృష్ణుని విడవఁజాలదు.—

(తెర లో)

సత్యము పలికితివి. రోహిణి, చంద్రుని విడచినను రాధ మాత్రము కృష్ణుని విడువఁజాలదు.

పద్మి:—(విని నవ్వి) కల్యాణీ! రాధ ఏమనుచున్నదో వింటివా? (అని కొంతవడి యూరకుండి స్మృతి నభినయించి) మఱచితిని. రాధిక వచ్చిన తోడనే నీ వాపె నూరక నిందింపవలయును. తరువాతి చర్య యంతయు నీవే చూడఁగలవు.

సత్య:—(కొంతవడి నిదానించి చూచి) నాథా! నిక్కవముగా పలుకుచుంటిరా లేక నామనోగత మెఱుంగుట కిట్లనుచుంటిరా?

పద్మి:—కాదు సుందరీ! నిజమే పలికితిని.

సత్య:—(సంతోషమున) నాథా! అట్టులేయైన రాధ నీనాఁడు సంపూర్ణముగ నవమానించి నాకసి దీర్చుకొనియెద.

(అప్పుడు రాధ "సత్యము పలికితివి" అని పఠించుచు ప్రవేశించుచున్నది.)

రాధ:—ప్రియా! నీచరణారవిందసందర్శనము నేటికిగదా మరల లభింపనున్నది, అట్టులేకదా!

సీ॥ సారహీనంబగు ♦ సంసార పాథోధి
తారకమ్ము భవత్ప♦దద్వయమ్ము
ఘోరపాపౌఘ కాం♦తార శాతకుఠార
ధారాసమము నీ ప♦దద్వయమ్ము
ప్రబలావివేక సం♦ప్రాప్త భూరిధ్వాంత
భానూదయమ్ము నీ ♦ పదయుగమ్ము
సకలలోకైక సం♦స్తవ దివ్యతాపసో
త్తమగేయము భవత్ప♦దద్వయమ్ము

తే॥ గీ॥ అమల సంపత్ప్రదము భవత్పదంఘ్రియుగము
దళిత శాత్రవము భవత్పదద్వయమ్ము
బఱగఁ గాంచఁగఁ జేకుఱెఁ బ్రాణనాథ!
వసుధ నను బోలు భాగ్యవతులు గలరె?

(అని ముందుకు చూచి) ఇదిగో నాథుఁ డిచ్చటనే సత్యభామాస్వామినితో ముచ్చటించుచున్నాఁడు. సమీపించి దర్శించెదఁగాక. (అని రెండడుగులు ముందుకువైచి నిలువఁబడి) ఒకవేళ సత్యభామ న న్నవమానింపఁ దలంపదు నే మో కదా? (విచారించి) కానిమ్ము. ఏది యెటులున్నను భర్త్రాజ్ఞ నతిక్రమింప నాకుఁ దరముగాదు. అంతకు నాథుఁడే కలఁడు (అని సమీపించి పద్మినికి నమస్కరించుచున్నది.)

పద్మి:—(మిన్నకుండును)

రాధ:—(ఆశ్చర్యముతో తనలో) ఇదేమి నాథుఁడే యూరకుండెను. ఇఁక నాకేది దిక్కు? అయ్యో! సత్యభామ న న్నవమానింపకుండునా? (కొంతవడి యూరకుండి) అయిన నిట్లు పలికిచూచెద (పైకి) అక్కా! నాథుఁ డీనాఁడు వ్యాకులచిత్తుఁడై ప్రవర్తిల్లుటకుఁ గారణ మేమి?

సత్య:—(ఈసడింపుగ) ఏమో నాకేమి తెలియును? తెలిసియుండియు న న్నడిగెద వేమే రాధా! (కృష్ణునిఁ జూచి) ఆర్యపుత్రా! నీకు ముద్దుగూర్చు గారాబంపు ముద్దరాలైన రాధ యిదే వచ్చియున్నది. కన్నెత్తియైనను జూడరేమి?

రాధ:—(తనలో) సత్యభామ వాక్యము లీర్ష్యాయుక్తములై యున్నను స్త్రీజనస్వభావముమాత్రము విడువక నారాక నాథున కెఱింగించినది కాని యిప్పుడు ప్రియుఁ డేమనునో!

పద్మి:—(విరక్తిభావముతో) సత్యా! ఏమనుచుంటివి? రాధ యెవ్వరు?

రాధ :—(విచారముతో) ఏమి! రాధ యెవ్వరనియా! నాథుఁ డిప్పు
డేని యిట్లుపలికియుండెనా? అయ్యో! నేననుకొనినట్లే యైనది.

సత్య:—(ఆశ్చర్యము నటియించి కపటోక్తితో) ఆర్యపుత్రా! ఇదేమి?
ఇట్లుపలికెదరు. మీచే నీపె ప్రేమింపఁబడినది కదా!

పద్మి :—సత్యా! నీ కింత వెఱ్ఱియేల?

రాధ :—(విషాదముతో తనలో) హృదయమా! నీ కిప్పుడు సంప్రాప్తమా
టిల్లినది. (పైకి) నాథా! యింకను బరీక్షింపవలయునా?

పద్మి :—(కన్నులెఱ్ఱఁ జేసి) ఇదేమే? ఇట్లు మాటలాడెదవు?

తే॥ గీ॥ వినుము నే నేడపతిని. నీ ♦ వేడసతివి
దూరముగఁ బొమ్ము మాటాడ ♦ నేర వింకఁ
బరులఁ గాంచియు నివ్విధిఁ ♦ బలుక నీకు
నో రెటుల వచ్చె సిగ్గులే♦ నేరవంత!

ఇది యిటులుండ.

మ॥ సుదతీ! నీవిటు లెట్లువచ్చితి విసీ! ♦ శుద్ధాంతకాంతాళితో
ముదమారన్ నిజకుంజగర్భమున సొం♦పుగ్ గుల్కనున్నట్టి యి
య్యదనన్ దోడిసతీమతల్లి నగరె 'నా♦థా!' యంచు నన్బిల్వ నీ
విది మర్యాద యటంచు నెంచితివి కా♦నీ! నీకు మర్యాదయే?

రాధ :—(విషాదముతో తనలో) అయ్యో! నాథునిచేత నెట్లవమానిం
పఁబడుచుంటిని? తుదకు నాయనురాగ మిట్లుపరిణమించినది కాఁ
బోలు? (విచారించి) అయ్యో! ఎంతపొరఁబడుచుంటిని! నాథుని
లీల లెఱిఁకినిఁ గనుఁగొనఁ దర మగునా? (పైకి) దేవా! నీపాద
మూలమే జీవనాధారము. నీ పలుకులే నాకమృతతుల్యంబులు. నీ
ముద్దుమొగమే నాకు పెన్నిధానము. ఇంతయేల నీ దాస్యమే
నాకు జీవనోపాయము. నన్ను రక్షించుము. (అని పద్మిని పాద
ములమీఁద వ్రాలుచున్నది. పద్మినిదూరముగా నెట్టుచున్నది.
దూరముగఁ జని కన్నీ రొత్తుకొనుచు నిలుచుండును.)

సత్య :—(చిఱునవ్వు నవ్వుచు) ఆర్యపుత్రా! ఎన్నియో బాస లొనరించి యిప్పుడీమెను నిరాకరించుట నీవంటివానికిఁ దగినది కాదు. ఇదిగాక మీరిడిన ముద్దుటుంగరముకూడ మఱచితిరా? అయ్యో! రాధ యెట్లు విలపించుచున్నదో చూడుఁడు!

పద్మి :—(చెవులు మూసికొని) కోమలీ! పాపము శాంతించుఁగాత! (తనలో) సత్య యిప్పుడు ముద్దుటుంగరముకూడ జ్ఞప్తికిఁ దెచ్చినది. ఇదియు గొంత యుక్తముగనే యున్నది. ఏమనిన? నింతకుఁబూర్వమే యది నాచే హరింపఁబడి యిప్పుడీ యుద్యమమందుఁ బ్రిధానోపకరణముగాఁ బరిణమించినది. మంచిది. ఇట్లుపలికిచూచెద (పైకి) సుందరీ! నీకు నేను ముద్దుటుంగర మిడినట్లు సత్య వచించుచున్నది. ఎదీ? యొకమారిటు చూపుము.

రాధ :—(తనలో) కట్టా! నాథుఁడీరీతినిఁ బలుకుట నెన్నఁడును జూచి యెఱుఁగను. అయినను ప్రియునిమాటకు జవదాటుదానను గాను. (పైకి) ఇదిగో చూడుఁడు (అని యుంగరపు వ్రేలినిఁ దడివి చూచి) అయ్యో! నా వ్రేలి యుంగరము లేదు. (అని దుఃఖమున సత్యభామవంకఁ జూచుచున్నది.)

సత్య :—(వెక్కిరింపుగ) పాప మెక్కడనో జారిపోయినది కాఁబోలు!

పద్మి :—(చిఱునవ్వు నవ్వుచు)మగువలు సమయోచితబుద్ధి కలవారని పెద్దలు వచించుట కిదియే కారణము. ఔరా! తరుణు లెంతటివారు.

సీ॥ వలపులు గురిపించి ♦ కులుకుచుఁ దరిఁజేరి
మక్కువఁ జెక్కిలి♦నొక్కి నొక్కి
కరగించి చిత్తంబు ♦ మఱపించి కులవధూ
మణిమీఁదఁగల ప్రేమ ♦ మాయఁజేసి

నాథ! నిన్నేమది ♦ నమ్మితిఁ గాఁగిటఁ
జేర్చి మన్మథుఁ గడ♦తేర్చు మనుచుఁ
దటుకున రతికేళిఁ ♦ దనియించి మోహంపు
దాళ్ళను బంధించి ♦ దయ నటించి

తే॥ గీ॥ వలను జిక్కిన హరిణంబు ♦ బలె నొనర్చి
కడకు మోసంబు గావింతు♦గాదె జెలులు
మిడత ఫల మని ద్రిపికఁ ♦ బడినరీతిఁ
జెలుల నమ్మిన వా రిట్లు ♦ చెడుదు రబల!

సత్య:—(వ్యంగ్యముగ) నాథా! మీరు పలికినదంతయు వాస్తవమే కావచ్చును. కాని పురుషు లేమియు నెఱుఁగరు. వారు వట్టి యమాయకులు. అట్టులేకదా!

ఉ॥ తేనియలొల్కు పల్కుల ని♦దేహరిణాక్షి! యటంచు మెల్ల నెం
తేనియు బల్కి బాస లొన♦రించుచుఁ దీరని వెట్టిఁ బెంచి కాం
తానివహంబు మెచ్చఁ దొలు♦తగలపేర్మిను వెల్లడించి యా
పై నిఁక వీడఁజాలు పుగ, వారల నెందును నమ్మవచ్చునే?

అందులో నార్యపుత్రుఁ డేమియు నెఱుఁగఁడు. (అనినవ్వుచున్నది.)

పద్మి:—(చిఱునవ్వునవ్వి) సుందరీ! సమయమును గనిపెట్టి బాగుగా నెత్తిపొడిచితి వంతియే చాలును.

రాధ:—ఔరా! కాలమహిమ! ప్రియుఁడు నన్నవమానించినను భగవంతుని లీల లిట్లుండు నని సహించి యున్నదానను; కాని సత్యభామచే నిందింపఁబడిన యార్యపుత్రునిఁ జూచుచు నెట్టు సహించియుందును? ఇప్పు డది పలికినను దప్పుగనే తోఁచుచుండును. మూర్ఖునకు హితవచనంబు లపథ్యంబు లైనట్లు నామాట లిక్క డేమి పనికివచ్చును? అయినను యిట్టు మందలించి చూచెద (పైకి) అక్కా, కోపగింపకుము. నాథు నిట్లు నిందింపవచ్చునా? కాని;

తే॥ గీ॥ కుటిలుఁడైనను నెక్కుడు ♦ కోపియైన
నధముఁడైన దయాహీనుఁ ♦ డైనఁ బాప
కర్ముఁడైనను నెంతటి ♦ కఠినుఁడైనఁ
బతితుఁడైనను ధవుఁడె దైవంబు సతికి.

సత్య :—ఇప్పటికి నాకు సమయము లభించినది. (అని లేనికోపముతో పైకి) ఓసీ! మాయలాడీ! తుదకు నీ వెంతటి దాన వైతివే? ఈ శ్రీరంగనీతులు మాకుఁ దెలియనివికావు. చాలు చాలు ఇఁక నైన నూరకుండుము.

తే॥ గీ॥ మాటలాడకు తగుదు న♦మ్మా! యటంచుఁ
గులుకుచును వచ్చినంత నే♦కొదవలేదు
నీతు లుపదేశ మొనరింప ♦ నిన్ను బొట్టుఁ
గాటుకను బెట్టి పిలిచిరే ♦ బోటి! యిటకు?

మఱియు, నిదిగాక.

శా॥ ఈమాటల్ మును మే మెఱింగినవికా♦వే! యోసి! గయ్యాళి గంపా! మర్యాద లెఱుంగకే ధవుని మా♦యల్ జేసి యాప్పై నిటుల్ మోమోటం బిసుమంత లేక పలుకన్ ♦ లోపంబె! మాకిప్డు రాధా! ముంజేతుల కంకణాలు గన న♦ద్దంబేటికే పొమ్మికన్.

రాధ :—(వినయముతో) అక్కా! అట్టులే పోయెదను క్షమింపవలయును. (తనలో) కానిమ్ము, యిప్పుడు నాథుఁ డేమనునో కదా!

పద్మి :—(విసువు నటియించి) కాంతా! పొమ్మనినఁ బోవలదా! నీ కీ రాద్ధాంత మేల? సత్య నన్నేమి నిందించినది? పోనిమ్ము. ఇట్టిమాటలు భార్యాభర్త లన్యోన్యమున మాటలాడుటయు నెఱుఁగవా? ఇంత లోకమర్యాద నెఱుంగనిదాన వైతివేమి? ఏది యెట్లులున్నను!

చం॥ వనిత! యిఁకేల? నోటికిని ♦ వచ్చినయట్టుల బ్రేలె దీవు మ
మ్మను వెలిఁబెట్టి "కోడలికి ♦ బుద్ధినిఁజెప్పచు నత్త రంకుఁ జే
సిన"దను సామెతన్ దెలియఁ ♦ జెప్పితి వంతియె చాలు నిప్డు నీ
పనియొనరించుకొంటి వహా♦వా! వడి దారినిఁ జూచుకొమ్మిఁకన్

గాధ:—(తనలో విచారించుచు) అయ్యో! నాకెట్టి బెడద సంభ
వించినది! కనికర మింతయైనను దలంపక నాథుఁడును సత్య
భామాసహాయుఁడై నన్ను నిందింపఁ దలంపడె! ఇందేదియో
రహస్య ముండవలయును. (విచారించి) రహస్య మే మున్నది?
నామనోగత మెఱుంగుటకుఁ గాఁబోలు, నార్యపుత్రుఁ డిట్లు
నన్నుగడఁ బన్నియుండవచ్చును. సందియము లేదు. (అని కృష్ణుని
యుద్దేశించి) ప్రియా! నీలీల లతివిచిత్రములుగదా! ఇంకను
నన్నుఁ బరీక్షింపవలయునా? అయ్యో నాథా! యిది కడసారి
పరీక్ష కాఁబోలు! (కొంతవడి యూరకుండి) ఏది యెట్లు లున్నను
నిప్పు డీ యవమాన మెట్లు భరింప నగును? అవమానమనిన
నిప్పటికిని గర్భనిర్భేదన మగుచున్నది. అట్టులే కదా!

ఉ॥ ఈవిధి నన్ను భంగమొన♦రింపఁదలంచి కటూక్తులన్ బలా
రే వడిఁ దూలఁజేయుచు ని♦సీ! యని దూరుచు నిర్వికారమై
వావిరి నింద సల్పిరి వి♦వాద మిఁకేటికిఁ దాటికిందఁ బాల్
దావినఁ గల్లుగాదొకో! హి♦తంబు వచించిన లాభ మే మిఁకన్?

(విరక్తిభావముతో) ఛీ! ఛీ! ఎట్టిపరిమాద మందుచుంటిని!
సత్యం నన్ను నిందించిన దనుకొంటిని — కాదు — కాదు. నానైచ్య
స్వభావమే యిట్టి దురూహకుఁ దావిచ్చినది. సత్యయం దావిర్భ
వించిన కృష్ణమయ తేజమే నన్ని పరీక్షకుఁ బురిగొల్పుచున్నది.
కాకున్న బ్రియుఁ డెన్నఁడేని యిట్లు పలికియుండెనా? నాథా!
బ్రహ్మాదులకు నయితము తెలియరాని నీమాయలను దన
కుటిలస్వభావము నితరులపై నారోపించుకొనెడి యీ పాపా

త్సురాలికి నెట్లు తెలియును? అయిన నోతల్లీ! యమునా! యింక నాలస్యమెందులకు? కఠినమగు నీ విషమ పరీక్షయం దుత్తీర్ణత వహించుటకు చేయూత నొసఁగి నాథునిముద్దు సెల్లింపుము(అని కొంతవడి యూరకుండి) అయ్యో! నీకును గొరమాలినదాన నైతినిఁగాఁబోలు! ఏమి! మాటాడవు!

మ॥ నటదుత్తుంగతరంగ సంఘచయ నాదనా నిస్వనోదంచితో
త్కటపాణిప్రకరప్రసారముల "రాధా! వేగ రమ్మం"చు ము
చ్చటఁదీరన్ భవదీయగర్భకుహరశ్శాంతిన్ ముదంబంద ని
ప్పటికైనన్ ననుఁజీరరాదె జననీ • పాపౌఘ సంహారిణీ!

పద్మి:—(జనాంతికముగా) చూచితివా సుందరీ! రాధ యిప్పుడు యమునలో దుమికి ప్రాణములు వాయఁగలదు. ఇఁక మన సుఖమున కంతరాయము లేకుండును.

సత్య:—(హర్షముతో మరల జనాంతికముగా) నాథా! ఇప్పటికి గదా వినఁదగినమాట వింటిని.

రాధ:—ప్రియా! నీకిదియే యుక్తముగాఁ దోఁచెనా? ఇదికాదు. అగ్నియందైన నురికెదను, బడబానలమైనను సహించెదను. కాని నీ వియోగాగ్ని నెట్టు సహించెదను? (అని కొంతవడి యూరకుండి) జీవితేశా! ఏమి మాటాడవు? నీసంకల్ప మిదియేకాఁబోలు. అయిన నో మారుతములారా! ఇంక సందియ మెందులకు? నన్నెందైన నెత్తికొనిపొండు. దిక్పాలులారా! నాకు మరణమును గల్పింపుఁడు. పర్వతములారా! నాతలపై నధిష్ఠింపుఁడు. ఓతల్లీ! భూదేవతా! నీవైనను బాతాళములోనికిఁ గొనిపొమ్ము. చిత్తమా! నీవింక మాధవుని చరణారవిందములాశ్రయింపుము. సాహసమా! నావెన్నంటి నడుచుచుండుము. పిరికితనమా! నీ వెటకేని జాగుసేయక పొమ్ము. ఓతల్లీ! గం

గాంభవాని! నీవైనను గరుణించి యమునాదేవి కనుజ్ఞ
నిమ్ము, నీ కిది యొక లెక్కగాదు. ఏమందువేని!

సీ॥ సతితోడఁ గయ్యంబు ♦ సలుప నెంచితివొక దా!
హరజటాజూటమం♦దలరితీవు
హరుఁడల్లుఁ డౌటకై ♦ సరసిజాక్షుని పాద
పద్మంబులను బుట్టి ♦ ప్రబలితీవు
'వీరమాతృ'పదంబు ♦ వెలయింప శంతను
కాంతవై భీష్మునిఁ ♦ గంటివీవు
నాఁడు భగీరథుం ♦ డేడనో దపియింప
దివినుండి భువి కరు♦దెంచితీవు

తే॥ గీ॥ సకలలోకంబులను నేలు♦జాణవీవు
మూఁడుమూర్తులు మెచ్చిన ♦ పోఁడవీవు
తల్లి నిన్నెంచఁదరమె. నం♦దనిని బ్రోచు
కరణి నన్నేలు జనని గం♦గాభవాని!

(అని యమునదరికేగి నిలఁబడి బద్ధాంజలియై కృష్ణుని దలం
చుకొని) నాథా! తప్పులున్న సైరించి యీ యభాగ్యురాలను
నీపాదమూలమున జేర్చుకొమ్ము. ఇదియే నాకడసారి విన్నపము.
మఱియు;

మ॥ దురితవ్రాతలతాలవిత్రము మునిస్తోమాభివంద్యమ్ము దు
ర్భరసంసారకరాళవార్ధితరణో♦పాయమ్ము సత్సంపదా
కరముజ్ఞాననిధి ప్రదాన మవివే♦కధ్వాంత సూర్యోదయం
బరవిందాక్షపదారవిందము శర♦ణ్యంబై విరాజిల్లెడిన్.

(అని యమునలోఁ దటాలున దుముకుచున్నది)

సత్య :—(తనలో) ఇప్పటికిఁగదా నాకోరిక ఫలించినది. (అని బైటికి
వచ్చి) నాథా! ఇటుచూడుఁడు. రాధ యెట్లు వెతఁజెందుచు
న్నదో(అనిమరలఁజూచి జాలితో)అయ్యో అయ్యో! ఇదేమి జల

చర మేదియో రాధ నీడ్చుకొని పోవుచున్నది? ఇంక నాల స్యముఁ జేసెద రేల? నాఁడు మకరినిఁదుంచి గజేందుని రక్షిం చిన తెఱంగున నిప్పుడీమెను రక్షింపకున్న వేఱుగతిలేదు.

పద్మి :—సత్యా! ఇంతటి జేలవైతివేల? నీకోపమేమైనది? (అని నవ్వుచు) ఆఁడువారి సామర్థ్య మింతలో నున్నది.

సత్య :—(కోపముతో) చాలులెండు. ఇక్కడ నాడువారు కానివా రెవ్వరు!

పద్మి :—(తనలో) ఆఁడువారి నైజగుణ మింతియేకదా! ఏది యెటు లున్నను నాకపటము వెల్లడియగు నేమోయని భయము తోడ ముచున్నది.

సత్య :—(మరల నిదానించి చూచి) ఓహో! ఏదియో జలచర మనుకొంటిని. కాదు, నాథుఁడే-రాధను తన భుజమం దిడుకొని దరికిఁ జేర్చుచున్నవాఁడు! అయ్యో! ఇంక నేమిచేయుదును? ఇం దేదియో మోసమే జరిగినది. ఇతఁ డెవ్వరై యుండ వచ్చును? (అని వెనుకకుఁ దిరిగి యాశ్చర్యమున గృష్ణునివంకఁ బద్మినివంక మాటికి మాటికిఁ జూచుచున్నది.)

పద్మి :—(తనలో) ఔరా! తా నొకటి తలఁప దైవ మొకటి దలఁచె నను నటుల రాధను బరిభవింపఁదలఁచి సత్యభామకుఁ బ్రియముఁ గూర్పనెంచిన నాకే యవమానము వాటిల్లినది. కాని సత్య భామకుఁ గలిగిన యవమానమునకుఁ బరిమితియే లేదు. హా! హతవిధీ! నీసామర్థ్యమంతయు నిచ్చటనే వెల్లడింప నెంచితివా? కానిమ్ము! (అని పైకి) రాజ్ఞీ! (అని నాలుక గొఱుకుకొని) అట్లు బిత్తరపోయి చూచెద వేల? (అని నవ్వుచున్నది)

సత్య:—(తొందరగా, వ్యాకులచిత్తయై) పద్మినీ! పద్మినీ!(అనికూలఁబడి) అయ్యో! ఎంతపని చేసితివే! ఇట్టి యకృత్యమునకుఁ బాల్పడు మని నీతో నెన్నఁడైనను జెప్పియుంటినా? కట్టా! ఇఁక నాథుని

ముఖ మెట్లుచూడఁగలను ? (అని కొంచె మూరకుండి కోప మున) ఓసీ! పద్మినీ! కాదు. రక్కసీ! దురాత్మురాలా! ఛీ! ఛీ! అవలకుఁ బొమ్ము. పంచమహాపాతకములకు దావలమైననీ మోము గనినంత నేగుండెగుభిల్లుమనుచున్నది. ఇంటఁదినియింటివాసములు లెక్కించునట్లు. తుదకు నన్నే చెఱుప నిచ్ఛగించితివి. ఎంతటి ప్రౌఢవు! ఎంతటి సాహసురాలవు!

పద్మి:—(తనలో విచారించుచు)కట్టా! తుదకు నా కెట్టి గతి వాటిల్లినది. ఇటు సత్యభామకు నటు గృష్ణునకుఁ బనికిరాక రెంటికిని జెడ్డ రేవడనైతిని. కానిమ్ము. చేయవలసిన దేమున్నది! (అనిపైకి) నెచ్చెలీ! జరిగిన దానికిఁ జింతించినను బ్రయోజనములేదు. నే నొకమాట చెప్పెదనువినుము, అదియు నచ్చకున్న తరువాత నీ యిచ్చవచ్చిన ట్లొనరింపుము.

సత్య:—(ఈసడింపుగ) ఆ! ఇదియాతీరుననైనది. ఇఁక చాలు నూరకుండుము. చెలికత్తియల విశ్వసించి చెడిన వా రెవ్వరో యిప్పటి కైనను గురుతించితివా?

పద్మి:—(చిఱునవ్వు నవ్వి) నెచ్చెలీ! సగము చచ్చియున్నపామును జంపఁజూచుట యుక్తముగాదు. ఇటువినుము. (అని సత్యభామ చెవిలో నేదియో చెప్పుచున్నది.

సత్య :—(విని యానందించుచు) నెచ్చెలీ! బాగుగా పలికితివి. అట్టులే చేసెదను. కాని వృషభానుఁడు మనము చెప్పినచొప్పున నాచరింపవలయుగదా! (కొంచెమాగి) అయినను మనమిక్కడ నేమన లుట యెంతమాత్రము బాగుండదు. గోరుచుట్టుమీఁద రోకంటి పోటునినట్లు పరాజయ మొందిన మనమింకను రాధాకృష్ణులచే పరిభవింపఁ బడుదుము. ఇదె పోవుదము రమ్ము. (అని యెదుటఁ జూచి) చూచితివా పద్మినీ! చతురిక తెచ్చియిచ్చిన ధౌత

వస్త్రములఁ ధరించి రాధ నూరడింపుచు వల్లభుఁ డిటే వచ్చు చున్నవాఁడు. మనమింక నాలస్యము చేయరాదు.

(అని నడచుచున్నది)

పద్మి :—అట్టులె (అని వెనుక నడచుచున్నది)

(అప్పుడు పైనఁజెప్పఁబడిన విధమున రాధనూరడింపుచు ధౌతవస్త్రాలంకృతుఁడై కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కృష్ణు :—(దీనముగ) దేవీ! ఊరడిల్లుము. అవమాన మనిన దేహము నకే కాని యాత్మకులేదు. దీనికై యింతగాఁ దుఃఖించెద వేల? ఇటు చూడుము!

తే॥ గీ॥ చెలు వుమీఱెడు మోమునఁ ♦ జిఱుచెమటలు
గ్రాలఁ గన్నుల నశ్రులు ♦ రాల, మేను
వివశతను బొంద నధర పల్లవము గంద
బాల! యివ్విధి దుఃఖించె ♦ దేల యిపుడు?

సుందరీ! ఇంకను దుఃఖించెద వేల? ఇటు చూడుము. నీ దుఃఖమును బంచుకొని విలపించుచున్నవో యనునటుల నీ వనచరంబు లెంతగా జింతిల్లు మన్నవో! అట్టులే గదా!

సీ॥ సలలితబాలర♦సాల పల్లవఖాది
యగు పికం బొల్ల దా♦హార మరయఁ
బరికింపఁ గలకల♦స్వన మొల్ల విడనాడి
విలపింపఁ దొడఁగె నీ♦పెట్టిచిలుక
గమనలాలిత్య మా♦కలహంసిక దొఱంగి
జడత వహించె నా♦శ్చర్య మొంద
నిలిచినచోటనే ♦ నిలిచి చూచుచునుండెఁ
జకితయై లేడి గ్రా♦సంబుమాని
కమ్మ పూదేనియలు గ్రోలి ♦ "ఝం"మ్మటంచుఁ
బాటఁబాడెడి నీ యెల♦తేఁటి పాట;

బాడుటను మాని నీవిట్లు ♦ పరఁగుచుంట
పీడు మీఁకనైన దుఃఖంబు ♦ వెలఁదిమిన్న.
మఱియు;

చ॥ సరస శిరీషపుష్ప సదృ♦శం బగు మే నిటు వాడనేల నీ
తరువులు వ్రాల్చెఁ బూవుల నఁ♦దారత నశ్రులు నించుభంగి నో
తరుణి! యిఁకేల? నా పలుకుఁ ♦ దథ్యమ టంచును నమ్మవేని నీ
వరయఁగరాదె కన్నులఁ దొ♦ఱంగెడి నశ్రులు మెల్ల నొత్తెదన్.
(అని అట్లు చేయుచున్నాఁడు)

రాధ:—(వినయముతో నివారించుచు) పూజనీయులైనవారియెడ నపరాధ మొనరింపనేరను. ఇదిగాక నా కవమాన మెక్కడిది? నేటికిఁగదా మునిపుంగవులకు సయితము దెలిసికొనరాని యనివార్యమైన ప్రభావమును తెలిసికొనఁగలిగితిని. ఇప్పటికిని పొంగి పొరలివచ్చు నీ యానంద బాష్పములకు మితిలేదు. ఇంతకన్న నింకేమి గావలయును?

కృష్ణ:—దేవీ! నీ నిష్కలంక మగు ప్రేమస్వరూపమునకు ఫలంబని యెఱుంగుము. [అని చిఱునవ్వు నవ్వుచున్నాఁడు]

రాధ:—(సిగ్గుపడును)

కృష్ణ:—(తనలో) ఆత్మస్తుతి సహింపకుండుటయు నొకమంచి గుణమే. (పైకి) దేవీ! బానిస కూఁతు రగు నాపద్మినికి నీప్రేమ తత్త్వ మెట్లు తెలియగలదు? నీ కవమాన మొనరింప నెన్ని పన్నుగడలు పన్నినను గడకు బరిభవము పొందినది పద్మినియే!

రాధ:—దేవా! నన్నేల యిట్టు లుగ్గడించెదరు? ఇదియంతయు మీ కృపయేకదా! ఒకవేళ పద్మిని నిమిత్తమాత్రము కావచ్చును; కాని యదియు మీ లీలయే. (అని చిఱునవ్వు నవ్వుచున్నది)

కృష్ణ:—ఇప్పుడుమాత్ర మూరకుందునా?

[ తెరలో ]

ఓ పద్మినీ! నీసహచరుఁడగు బద్మినీరమణుని విశ్వా_న
కుము. చంద్రుఁడిచే యుదయించుచున్నాఁడు.

రాధ :—[విని తొందరపాటుతో] నాథా! ఇంక సందియము లేదు.
మీరు పలికినది వాస్తవమే యైనది. ఇదియు పద్మిని యొనరిం
చిన కుట్రయనియె నిశ్చయింపవలయును. జనకుఁడిచ్చటకు
వచ్చుచుండె ననియు నీవు కృష్ణుని విడనాడకు మనియు నిపుణిక
యొనరించిన హెచ్చరికవలన నంతయుఁ దేటతెల్లమగుచున్నది.
ఇఁక నాకు సెలవీయఁదగును.

కృష్ణు :—[నవ్వి] సుందరీ! అట్టులే—కాని నీకుఁ దండ్రివలన నిర్బం
ధము గలిగినపక్షమున పురుషవేషము ధరించి నన్నుఁ గలిసి
కొనుచుండుము.

రాధ :—నాథా! అట్టులే యొనరించెదను.

(అని యిరువురు నడచుచున్నారు).

(తెరజారును.)

ఇది చతుర్థాంకము.

---



శ్రీమత్పరదేవతాయై నమః.

# కల్యాణరాధామాధవము.

## పంచమాంకము

రంగము—యమున దరినున్నయొక యడవి.

(వ్రజసుందరి ప్రవేశించుచున్నది)

వ్రజ :—(తనలో విచారించుచు) ఛీ! ఛీ! ఈ స్త్రీజాతి కుండు నైజగుణ మింతియేకదా! నిన్నటిదినమున యమునకు నీరు దేర నేలఁ బోవలయును ? పోయినవా రందరు పరపురుషుల నీగతి వరించి వెంబడించిరా? పోనిమ్ము. వరించితి ననుకొందము. కాని యతని చిత్తవృత్తి దెలియక పండువంటి పంసారమును బాడొనరించు కొని కులమర్యాదకు మీరి కిన్నబిడ్డ "లమ్మా!" యని యడలు చుండ పట్టె డన్నమైనను ముట్టక నివ్వీధి వలపుకానితోడఁ గారడవులఁ దిరుగాడవలసివచ్చె. హా! హతవిధీ! (అని కొంచెము మూరకుండి) కానిమ్ము. ఇంతకును నీ వ్యభిచారవృత్తి యట్టిది. అట్టులేగదా!

చ॥ కలధనమెల్లఁ బోవు నిజకాంతుఁడు మారుమొగంబువెట్టుఁ జు
ట్టలు దృణ మట్ల జూతు రకటా! తలిదండ్రు లొకప్పు డేటిలో
పలఁ బడఁ బర్వులెత్తెదరుఁ బాయును గీర్తి కులంబు రోయుఁ బి
డ్డలు దలవంచుకొందురు పడంతికిఁ దప్పి చరించు టొప్పునే?

(అని నడచుచున్నది)

(ఇది విష్కంభము)

రంగము :- యమున దరినున్న యొకయడవి.
(రాధ పురుషవేషమునఁ బ్రవేశించుచున్నది.)

రాధ:—

ఉ॥ నల్లని మేనివానిఁ జిఱునవ్వులు వింతగ సందడింప రా
జిల్లెడు మోమువానిఁ దులసీదళమాల ధరించువాని బల్
చల్లనివీక్షణంబు వెదఁజల్లెడువానిని గౌస్తుభాన్వితుఁ
ఫుల్లసరోజనేత్రుని విభూషణభూషితు నాథుఁ గంటిరే!

ఓ చంద్రసూర్యులారా! మీరలైనను నానాథునిఁ జూచితి
మని పలుకరేమి? అయ్యో! ఇంకెందు బోదును? యేమిచేయుదును?
(అని యొక ప్రక్కకు దిరిగి)

సీ॥ యదునాథు మీర లెం డైనఁ గన్గొనినారె
కరులార! హరులార! హరిణులార!
వసుదేవదేవకీవరపుత్రుఁ గంటిరే
విరులార! ఫలయుక్త తరువులార!
శ్రీవత్సకౌస్తుభశ్రీయుక్తు గానరే
సురలార! సిద్ధ కింపురుషులార!
రాధాసఖి మనోనాథు వీక్షించిరే
యక్షులారా! సురాధ్యక్షులార!

తే॥ గీ॥ వింతజిఱునవ్వు లొల్కఁగ వీక్షణముల
ముద్దుగొల్పెడి నాజగన్మోహనాంగు
యాదవాన్వయ వార్ధి సుధాంశు నాథుఁ
గాంచితిరె మీర లెందేని గరుడులార!

కట్టా! ఇట్టివింత యెం దైనను గలదా! నాఁడు ప్రియుఁడు
చెప్పిన దంతయు సక్కువ మైనది. నిన్నటిదినమునఁ బద్మిని పన్నిన
పన్నుగడవలన జనకుండు కోపించి—"ఓసీ! రక్కసీ! నీ వింక
గృష్ణునితోడి సహవాసమును బరిత్యజింపుము. లేదేని నా కర
వాలంబున "కేరయ్యొద" వని మందలింప విధిలేకఁ బ్రియుని

యనుమతి శిరసా వహించి యెట్టులో నీ పురుషవేషము ధరింప నియ్యకొంటిని. పదంపడి కొంతసాహస మవలంబించి యిలువీడి నందునిమందిరంబున కరిగి ప్రియు నచ్చటను గానక గనంబడిన వారి నెల్లరినిం జిరకాలమిత్త్రుఁడగు మాధవునిం జూచియుంటిరా? యనియడుగుచు గడకు నీ యమునాతీరమునకుం జేరితిని; గాని యిక్కడను గృష్ణుని జాడయే గనుబట్ట దయ్యెను. నాథా! నిన్నొకసారియేనిం జూడవలయు నని గంపెడాసతో నీ కడగండ్లకుం బాలగుచున్న నాయందింకను గనికరము వహింపవుకదా! అయ్యో! యీదాహబాధ యెట్టులున్నను నింక నడువం జాలను, నడువంజాలను. ప్రాణము లెగిరిపోవుచున్నవి. దేహమంతయు శిథిలమై పచ్చిపుండువలె నున్నది. అట్టులేగదా! అయ్యో! అయ్యో! (అని తనదేహమును జూచుకొని నిట్టూర్పుపుచ్చి)

చ॥ దొనదొనమంచు నెత్తురిటు ♦ దొర్లుచు బాదము లెట్టివారె, ని
స్సని వెలింబుచ్చు నూర్పుల కహా! మితిలే దదిగాక పెల్లు వె
చ్చనివడగాడ్పుపేవం బెలుచన్ ధృతిదూలె శరీరమున్ జెమ
ర్చెను కను లోఁగెలోనికి నిసీ! యింక జీవము నిల్పనేర్తునే?

అబ్బా! యీప్రాణము లెగిరిపోయిన నెంతయో సంతసించుదునే! నాథా! నీవు చెంతలేనియెడ నీ జీవములతోడి బనియేమి? (అని కొంతపడి యూరకుండి) అయ్యో! ఇప్పటికైనను మాటాడ రాదా! కనికరము లేదా! నేను నీ రాధికను గానా! యెందుకిట్టు లూరకం జూచుచుండెదవు? నారోదన మరణ్యరోదన మయ్యెనా! అయిన నోమృగములారా! యింకసందియ మెందులకు? నన్ను మ్రింగి మీ యాకలినిం దీర్చుకొనుఁడు. (అని యెదుటం జూచి) ఇ దేమి కడువింతగనున్నది. వ్యాఘ్రమునన్ను దినవచ్చియు మరల నూరక తిరిగి పోవుచున్నది. పోయి వేడుకొనియెదంగాక (అనిలేచి సమీపించి బాహువెత్తి) ఓ! వ్యాఘ్రరాజమా! ఒకమాట వినిపోమ్ము.

తే॥ గీ॥ రాలుగలిగిన యట్టి మా◆ర్గంబునందుఁ
బడలివచ్చుట సత్త్వ ◆ యుడిగి కంచుఁ
దలఁచెదవె! ముండ్లవలని బా◆ధలఁ జెమర్చు
ర క్తమేనియుఁ గొనుము వ్యా◆ఘ్రింబ యిపుడు.

(అని రెండడుగులు ముందుకు వైచి) అయ్యో! యింతలో వ్యాఘ్రి యెట్లు వెడలిపోయినది? కట్టా! ఈ మొండిప్రాణము నకుఁ జావు లేదుగాఁబోలు! (కొంతవడి యూరకుండి) ఔరా! క్రూరమృగమునకు నయితము బనికిమాలిన నీ యౌవనరూపముల తోడి నాకింకఁ బని యేమి? సొమ్ములు మోయుటకా? కడ కెట్టి యభాగ్యురాలనైతిని— నాథా!

సీ॥ నీసేవ నొనరింప◆నేరని కరములు
కరములె సంతాప◆కరము లరయ
నిను భక్తిగాంచఁ జా◆లని పెద్దకన్నులు
కన్నులే యలనెన్ని ◆ కన్నులరయ!
నినుఁబ్రేమఁ బొగడ నే◆రని నాదు వదనంబు
వదనమే కిల్బిష◆సదన మరయ
రహిఁ నీదు గృహము జే◆రని యిట్టిపదములు
పదములె దుష్పథా◆స్పదము లరయ

తే॥ గీ॥ గరములును, నేత్రములును, వ◆క్త్రంబు, బాద
యుగళమింతట సార్థక్య◆మొందఁజేయు
మో దయానిధి! నీదు ప◆యోధరాభ
మూర్తి నొకసారి చూపి యీ ◆ బోటికిపుడు.

(అనియొకవైపునకు నిలఁబడి యేదియో యాలోచించి) ఆహా! ఇప్పటికిగదా కృతకృత్యురాల నైతిని. నాపలుకు లప్పుడే నీ చెవిఁబడెనా యేమి నాథా! ప్రేమయనిన నిట్టులుండవలె.

ఉ॥ ఏనిట నిన్నుగాంచి తరి◆యించితినో మురళీవిలోల నీ
గానకలావిలాసమున◆గాదె గళింగె మహీధరంబు గా

దేని కనంగరాదె సెల♦యేటను నీదగు పాటసొంపు నం
తేని ముదంబుగూర్చెడి యి♦దేమి కనుంగొన వెందుడాగితో!

నీ వెందుదాగినను సరియే. నే నీసెలయేటఁబడి తుదకు నిన్నే కలసికొందునుగాక! (అని సమీపించిఁ దుముఁకఁబోయి మరల విరక్తి భావముతో) అయ్యో! ఎట్టి వెఱ్ఱిపని చేయుచుంటిని! నాథునిచే లాలింపఁబడుచున్న నీయవయవములను వ్యర్థముగ జలచరంబుల పాలేల జేయవలయును? వీని నమ్మహాపురుషునకే సమర్పించెదఁగాక! ప్రియా! ఇంకను బరీక్షింపవలయునా? అయ్యో! నీరూప మొక్కసారి కనుంగొన నవకాశమిచ్చినఁ జాలు నంటినే? అందలములు గోరితినా? మందిరములు గావలయు నంటినా? గొంతికకూడఁ దడియారుచున్నది. నాథా! మాటాడ వేమి?

(తెరలో)

హా! ప్రాణవల్లభా! నీకొఱకు వనమెల్లయు జుట్టి వచ్చితిని. యిక్కడనే యుంటివా!

రాధ:—(ఆతురతతో) ఏమీ! నాథుఁడుగాడుగదా? (అనిచూచి నిరాశఁజెంది) అయ్యో నాథుఁడనుకొంటిని. కాదు, పురుషుఁడని భావించి నా వెన్నంటివచ్చిన యొకానొక వ్రజసుందరీమణి. ఈపె యెట్టిదుష్కృత్యమునకుఁబాల్పడుచున్నది. (అనియెదుటఁ జూచి) అదిగో! కనఁబడుచున్న తామరకొలనిలోని పద్మిని నెపంబున నీమెను నిందించి వెనుకకు మరలించెదఁగాక. (అని పద్మిని వంకఁజూచి) ఓసీ! పద్మినీ! తుదకు నీవింతఁ గొఱ మాలిన దానవైతివేమి? అతి నైచ్యమగు వ్యభిచారవృత్తికి బాల్పడిన నిన్నేమనవలయు? కట్టా! ఎట్టిపనిచేసితివి?

ఉ॥ ఎంతటిదానవైతివె భ♦లీ నళినీ లలితాంగి! పద్మినీ
కాంతుని మోసగించితివి ♦ కాపురముండెడి లచ్చికండ్లకు

గంతలు గట్ట నేర్చితివి ♦ కంజభవుం డిది కావఁ డిందుకే
'నింతుల నమ్మరా' దని వ♦చించెడి పెద్దలపల్కు కల్లయే!

(మరల తెరలో)

మనోహరా! ప్రియులు నిందించినను యువతి యమృతో పమానముగనే తోఁచుచుండును.

రాధ:—(విని) అయ్యో! ఈపిశాచము నన్ను విడచు నట్లు లేదు. ఇటే వచ్చుచున్నది. ఏదియో నెపమున దప్పుకొందును గాక!

(అప్పుడు వ్రజసుందరి బద్ధాంజలియై దీనవదనంబున బ్రవేశించును)

వ్రజ:—

సీ॥ కోపమా! లేక నా♦పాపమా! మదనస్వ
రూప! నాతాపంబు ♦ నాపవేర!
బీరమా! నేచేయు ♦ నేరమా! మాటాడ
వేర! చేర విదేర! ♦ సారచరిత!
మర్మమా! నాదు దు♦ష్కర్మమా! నీకిది
ధర్మమా! యిటు లుంట ♦ నిర్మలాంగ!
మోసమా! నన్నుఁగూడ ♦ దోసమా! యిది రసా
భాసమా నను జేర♦రా! సురూప!

తే॥ గీ॥ చలము విడనాడి నీచెలి♦సరసఁజేర
వేని-నిను వీడ నిఁక నీదు ♦ వెంటవత్తు
నెచటి కేగిన విడువ ని♦న్నే భజింతు
గొలుతు నిరతంబు నామది ♦ గోర్కె లలర!

మనోహరా! ఈ నిర్భాగ్యురాలు నీకిదే యభివాద మొనరించుచున్నది, కైకొనుము. (అని నమస్కరింపఁబోగా రాధ ప్రక్కకు దిరుగును. గోపవనితయు నట్లేతిరిగి) ప్రాణనాథా! నావలన నేమి యపరాధము జరిగినది? సైరింపవలయును. (అని గడ్డము పట్టుకొని బ్రతిమాలుచుండును)

రాధ :—(నివారించుచు కృత్రిమకోపముతో) ఓసీ! మాయలాడీ! ఇక్కడ నీకు ప్రాణనాయకుఁ డెవ్వఁడు? పొమ్ము. ఆవలకు బొమ్ము.

వ్రిజ :—నాథా! ఇట్లనకుము. నీకై రాత్రింబవళ్లు నిద్రాహారములు వర్జించుటయే గాక భర్తనుసయితము విడనాడి నిన్నే దైవమని యెంచి వచ్చిన తరుణిని మోసగించుట నీబోంట్లకు దగదు. ఇదిగాక,

శా॥ మారాకార! యిదేల మారుఁ డిట సన్మార్గంబునుఁ వీడి దు
ర్వారక్రూరతఁ జెంది బాణతతులన్ బాధింపుచున్నాఁడు నన్
జేరన్ దీయర నీదు కౌఁగిలికి నిశ్చింతన్ మనోవల్లభా!
కారుణ్యాలయ! పుష్పసాయకుని దుర్గర్వంబు భంగంబుగాన్.
(అని సమీపింపఁ బోవుచున్నది)

రాధ :—(నివారించుచుఁ దనలో) ఔరా! నా కెంతయో సిగ్గగుచున్నది. ఏమిచేయుదును? కానిమ్ము. ఇట్లు పలికిచూచెద. (పైకి) నచ్చెలీ! కాదు—సుందరీ! ఒక మాటవినుము. నిన్నిప్పుడే పరిగ్రహించెదను; కాని నా కొక యనివార్యమైన వ్రతము గలదు. అయ్యది యారుమాసములలో పూర్తికాఁగలదు. పిమ్మట నిన్ను తప్పక స్వీకరించెదను. సరియేనా? యింకఁ బొమ్ము.

వ్రిజ :—(తనలో) తుదకు నాయవస్థ యిట్లు పరిణమించినది. (పైకి) మనోహరా! అట్టులేయైన నీపాదమూలమున నిందే గుర్తిమ్ము రిలుచుండెద. ఇఁకఁ బోయివచ్చెదను. (అని వెనుకకు దిరిగి చూచుచుఁ బోవుచున్నది.)

రాధ :—(సంతసించుచు) అమ్మయ్యా! ఇప్పటికెట్టులో పీడ వదలించుకొంటిని. ఇందుచే సమయముకూడ నతిక్రమించినట్టులున్నది. (అని పైకిఁజూచి) సందియ మేమి? సూర్యభగవానుఁ

డస్తాద్రి కరుగుటయేగాక నక్షత్రగణ పరివృతుఁడై నిశానాథుఁడు నయితముదయించుచున్నాఁడు; కాని నాథుఁ డుదయించుట యింకెన్నఁడో తెలియకున్నది. (అని వెట్టిదై యాకాశమువంకఁ దృష్టి నిగుడించి) ఓ నిశాదేవీ! నీవైనను నాథునిఁ దోడితెచ్చి నాకుఁ బ్రియము గలిగింపనేరకపోయితి వని చింత లేదు; కాని నభర్తృకవై పరిహాస మొనరించుచుంటి వని మాత్రము జింతిల్లుచుంటిని. (వినుక ట్లభినయించి) ఏమనుచుంటివి? నన్నే పరిహాసించుచుంటివనియా! అదెట్లు? (అని కొంచె మూరకుండి) ఓహో! నేనే పొరబడితిని. క్షమింపవలయును. నాథుఁ డిందే యుండెను. అట్టులేగదా! (అని పైకి చూచి నడచుచు) మనోహరా!

సీ॥ ముద్దులొల్కెడు నీదు ♦ మోము గన్గొన నేమొ
సిగ్గునచందురిందు ♦ చిన్నవోయె
నీపాదనఖసంఘు ♦ నిర్గతప్రభఁగాంచె
నేమొ చుక్కలు కాంతి ♦ నిట్టె తొఱఁగె
నీమేనుఁ దిలకించె ♦ నేమొ నీలఘనంబు
కలయాపునకుఁ దిలాం ♦ జలి నొసంగె
నీముద్దుచిఱునవ్వు ♦ లేమైనఁ గని నేమొ
వెలవెలఁబారె వె ♦ న్నెల దలంప

తే॥ గీ॥ నివుడు నాకంటఁబడ విది ♦ యేమి సుంత
జాలిలే కిట్టు వంతలఁ ♦ దూలఁజేయు
నగునె యమృతంబుజిల్కు జి ♦ ర్నగవులొల్కు
వదనమేనియు జూపింపు ♦ మదిరొమచాలు.

(అని నడచుచున్నది)

(అప్పుడు కృష్ణుఁడు స్త్రీవేషమునఁ బ్రవేశించుచున్నాఁడు)

కృష్ణు:—

సీ॥ బలిమి మత్తేభ కుం ♦ భస్థలంబులఁ జీల్చఁ
బరువెత్తు సింహశా ♦ బక చయంబు

పసికూనల నురంబు♦పైఁజేర్చి తరువులఁ
జరియించుచున్న వా♦నరకులంబు
పవనాహతిని రాలు ♦ బండుటాకుల కుల్కి-
యిటునటు పరువెత్తు ♦ నేణరాజి
కాసారముల నెల్లఁ ♦ గలఁచి నీ రెగజిమ్ము
ఘనమహీంధర తుల్య ♦ గజవితతియు
తే॥ గీ॥ గలిగి భల్లూక ఘోర వ్యా♦ఘ్రప్రపంచ
భరితమై యొప్పు నీ భూరి ♦ వన మదేడ,
జితగ్రత వానరమ్ముఁ గాం♦చియు భయంబు
నందు నీవేడ ? యెట్లుంటి ♦ వబల ! యిందు?

కట్టా ! ఇట్టిబెడద యెన్నఁడైనను సంభవించెనా ? లేదు— లేదు—జనకుఁడు నిన్నాడిన దుర్భాషలను మిత్రుఁడగు మైత్రేయుని వలన నెఱింగి నిన్నూరడింప నడుకట్టిన వాఁడనై యెందుకైనను మంచిదేకదా యని యాస్త్రీవేషముధరించి నీ యింటికరుగ నిప్పుడే రాధ పురుషవేషముధరించి యమునాతీరమున కేగిన"దని నిపుణిక వచించినది, తోడనే యమునాతీరమునకుఁ జేరి యందు నిన్నుఁగానక, కాలుగాలిన పిల్లిపగిది రాధా ! రాధా ! యని పిలచుచు నిలచినచోట నిలువక వనమెల్లఁ గ్రుమ్మరిలుచుంటిని; కాని నీజాడయే గనుపట్టదయ్యెను. ఈ నడిరేయిని నిన్నెచ్చటఁ గనుగొందును? (అనిపైకిఁజూచి) ఓహో ఇంకెంతయో ప్రొద్దులేదు, తెల్లవారవచ్చుచున్నట్టు లున్నది. ఇందే కొంతవడి విశ్రమించెదగాక. (అని యొక చెట్టుక్రిందఁ గూర్చుండి) ఇందెచ్చటనైన రాధ గాన్పించునేమో? (అని నలుదిక్కులు బరికించి) ఏమిది ఆశిలావేదికపైనాసీనుఁడై యున్న యువకుఁడే రాధయగునా ? (కొంచమూరకుండి) సందియ మెందులకు ? ఇతరులు దనను గురితింపకుండునట్లుల వేషము

మ్మార్పుకొనినను గనులయం దుండెడి చాంచల్యమే చెప్పు చున్నది. మంచిది. నేమను. రాధకడకే యరిగెదఁగాక. మదీయ భాగ్యోదయమునకు వ్యవధిలేనట్టుల సూర్యోదయమునకును వ్యవధిలేకున్నది. అట్టులేగదా !

ఉ॥ అక్కటా ! జ్ఞానశూన్యత సంహర్నిశలన్ విషయాభిలాషులై
చిక్కిన మోహనిద్ర వెడఁజిమ్మియు నచ్చపుజ్ఞాన దీప్తినిన్
జొక్కి తరింపు డంచు శుభసూచనముల్ బచరించెనో యనన్
గుక్కుట బృందమెల్ల వడిఁ "గొక్కొరకో" యని కూయుచుండెడిన్
(అని నడచుచున్నాఁడు.)

రంగము: యమునాతీర ప్రాంతభాగము.

(అప్పుడు రాధ పురుషవేషమునఁ బ్రవేశించుచున్నది)

రాధ :—(పైకిచూచి నడచుచు) అయ్యో! నాథా! నీ కింతకోఁతమాలిన దాననై తిఁ గాఁబోలు, ఇటుచూడుము. ఇట్టి మోస మొనరిం చుట నీవంటివానికి దగినదిగాదు.
ఏమందువా ?

సీ॥ తిరిప మిడితివా చంద్రిక కీవు లేనప్పు
తరఁగలఁ జిఱునవ్వు దళుకుఁదోఁచె
ధయ నొసంగితొ భానుతనయకు మెయితావిఁ
బంకజంబుల సౌరభమ్ముదోఁచె
పణమొడ్డితివె తీవపడఁతికి రాగంబు
గిసలయంబున మోవికెంపుఁదోఁచె
లంచమిచ్చితె వనలక్ష్మికి నీపల్కు
వంశీరవము పికధ్వనులఁదోఁచె

తే॥ గీ॥ బందుగులె వీరు మామకప్రాణనాథ !
ఎంతవేడిన నీకు రవంత యేని
దయజనింపదు నీదు సుందరపదార
విందయుగ మీయరాదె సేవింప నాకు.

అయ్యో! ఇఁక వడవఁజాలను. (అనిరుద్ధ శిలావేదికపై యాసీనమై నిట్టూర్పుపుచ్చి) ప్రియా! నీ ముద్దుమొగంబేనియుఁ జూడనోఁచనైతిని. ఎక్కడగ దాగియుంటివో కదా!

ఉ॥ దాగిలిమూత లాడెదు లతాంగినిఁ గన్మొరగించి బావురే!
దాగితి వెందు? నీయడుగుఁదమ్ములఁ గాంచియు మోదవార్ధినిన్
దూగుచు బాష్పబిందువులు దొర్లఁగ నిన్గనినంత నీవు నన్
గౌఁగిటఁజేర్చి ముద్దిడి సుఖాంబునఁదేల్చు టదెన్నఁడో ప్రియా!

(అని కన్నులుమూసి ధ్యాన మొనరించుచుండును.)

కృష్ణు:—(ప్రవేశించి, రాధనుజూచి) ఇదిగో పూజ్యురాలైన రాధిక.

ఉ॥ ఈరమణీలలామ మది నెంతయు భీతివహింప కార దు
ర్వారపథశ్రమాకలనఁ బాదతలంబులు నెత్తురార వి
స్తారము మాసినట్టి పరిధానము దాల్చి వియోగ మంది కాం
తారములందిటుల్ నిరశనవ్రతధారిణియై చరించెడున్.

రాధ—(భావనసేయుచు) ప్రియా! నీ విచ్చటనే యుండినను మందభాగ్యురాల నగు నేను గురుతింపనేరక నేదియో నోటికివచ్చినట్లు ప్రేలితిని. సైరింపవలయును.

తే॥ గీ॥ కాంచితిని కాదె యిత్తఱిఁ గన్నులున్న
ఫలము నానాథ! యొకమాట పలుకవేల?
రాలునాయేమి నోటిముత్యాలు బలుక
నట్టులేయైనఁ గౌఁగిలియ్యంగరాదె!

(అని వెఱ్ఱిదానివోలె చేతులు సాపుచుండును)

కృష్ణు:—ఇదియేసమయము. మెల్లఁగా నీపెదరికిఁజేరి రాధికాబాహుపాశములఁ గట్టువడి యాలింగనసౌఖ్య మనుభవించెదఁగాక (అని అట్లు చేయుచున్నాఁడు.)

రాధ:—(దిగ్గున గన్నులుదెరచి ఱిచ్చవడి) నీవెవ్వర......

కృష్ణు :—(అర్థోక్తియందే లేనికోపము నటియించుచు) నేనెవ్వరైన నీ కేమి? కాని నీవు వెఱ్ఱివాఁడ వనుకొందును. ఇంత కండ కావరమా!

రాధ :—అయ్యో! అయ్యో! ఇదియొక్కడి గ్రహచారము సంభవించినది! దైవమా! యొకమారిట్టులే మాయలాడి నొకర్తును వదలించుకొంటిని. ఇది రెండవది కాఁబోలు; కాని యీపిశాచము నాకు సాధ్యపడునట్టులేదు. అయిన నిట్టుపలికిచూచెద (పైకి) అగును. వెఱ్ఱిదాన నైతిని— కాదు— కాదు— వెఱ్ఱివాఁడ నైతిని. ఏమిచేయుదును?

కృష్ణు :—(నవ్వాపుకొనుచు కోపమున)

ఉ॥ చాలును జాలు నీకు సరసంబె! తటాలున నాథ! యంచు నీ
లీలను గౌఁగిలించియు'బలే' యని ముద్దిడఁ బోడియౌనె మేల్
మే లిటువంటి కార్యములు మీ మగవారికిఁ జెల్లుఁగాక నో
కూళ! పడంతి నాథునిగఁ గోరితివే మతిలేదే యింతకున్.

రాధ :—(తనలో) ఏమిది కడువింతగ నున్నది! సుందరిపలుకు లతికఠోరములయ్యును యమృతబిందువులువర్షించుచుమనోహరములై గ్రాలుచున్నవి. ఇదిగాక నాలింగన మొనరించునప్పుడు బరిచితుఁ డగు నాథుని భుజాంతరసౌఖ్య మనుభవించితినో యనునటుల మోదసాగరమం దోలలాడఁ దొడఁగితిని. (అని తనదేహమును జూచుకొని) ఇప్పటికిని శరీరం బింకను గగుర్పాటు వహించియే యున్నది (పైకి) అమ్మా! ఏల నిందించెదవు? సైరింపవలయును.

కృష్ణు :—(కోపముతో) ఓరీ! మూర్ఖుఁడా! సైరింపఁ వలయునుగా! ఎట్టు సైరింప దగును. పరపురుషకరస్పర్శచే నపవిత్రురాల నగు నేను నామగని కెట్లు బనికివత్తును? ఇట్టియవమాన మెన్నడైనను గలదా! (కొంచెమూరకుండి) కానిమ్ము మించిన దేదియులేదు ఒకమాటవినుము.

చ॥ పరువొకయింత లేక బల♦వంతమున న్ననుఁజేరి ముద్దులన్
ముఱిపెములందు డించితివి ♦ ముచ్చటఁదీరఁగ; బెక్కులేల ? యో
విరసపుమానిసీ! మగఁడు ♦ వెంగలి నన్నుఁకఁ జేరఁదీయ డే
తెరువునులేదు నీదగు య♦ధీనత నొక్కఁడుదప్ప వల్లభా!

ఇదిగాక,

ఉ॥ నిక్కముదాపనేల ? గరు♦ణింపుము యింపుజనింప నీ పయిన్
మక్కువగొన్నదాన సుకు♦మార ! బిరాన మనోభవాగ్నికిన్
దక్కిన నన్నుఁ గౌఁగిటను ♦ దన్పర వాతెఱనొక్కవేర ! యీ
ఫక్కిఁ దనంతఁ దావలచి♦వచ్చినబోటి యటంచు నొంచితే !

(అని సమీపించుచున్నాఁడు.)

రాధ :—(ఓరమో మిడి) సుందరీ ! నీ యాగడ మంతకంతకు మితి మీరుచున్నది. ఇదిగాక నిరుపేద నగు నన్ను మెడకుఁ గట్టుకొని యేమిచేయఁగలవు ?

కృష్ణ :—ఇదియంతయు నాకు దెలియదు. నీవు మగవాఁడవుకావా !

రాధ :—(నవ్వి యూరకుండును.)

కృష్ణ :—(నవ్వి) నీ వూరకుండినను నేనుమాత్ర మూరకుండుదానను గాను.

రాధ :—ఏమిచేయుదువు ?

కృష్ణ :—నిన్నుగౌఁగిలించుకొనెదను (అని అట్లు చేయఁబోవును.)

రాధ :—(నివారించుచు) ఇఁక నన్ను ముట్టకుము. దూరముగనుండుము. (అని నిరాకరించుచున్నది)

కృష్ణ :—(నవ్వి దీనము నటియించి) మనోహరా! ఇంత దయలేని వాఁడవైతివేమి? ఎట్టి మూర్ఖుఁడైనను వలచి తనంతవచ్చిన తరుణి నవమాన మొనరించునా ? కౌఁగిలింపకున్నను సరియె యొక్క ముద్దయిన నీయుము.

రాధ :—(తనలో) నాథుఁడీ స్త్రీవేషముధరించి యుండఁడుగదా ! (పైకి) సుందరీ! అట్టులేకానిమ్ము (అని కృష్ణుని ముద్దిడి పై

మఱచి) యేమిది! నాథునిముద్దిడినట్లుఁ దోఁచెడిని. అంతయు నాకేదియో చిత్రముగాఁ దోఁచుచున్నది? (అని కృష్ణుని వంక జూచుచున్నది.)

కృష్ణు:—పాప మీయబల నన్నుగుర్తింపక మిక్కిలి వంతఁజెందుచున్నది. అయిన నిట్టుపలికి చూచెద (పైకి) మనోహరా! ఇఁక నేనేగెదను.

రాధ:—(తనలో) మాటల సవ్వడిని జూడ కృష్ణునకే తగులుచున్నది. యేది యెట్టులున్నను నీ యువతియందు నాకేదియో యొకవిధమైన యనురాగ ముదయించుచున్నది (పైకి) ఓ సుందరీ! ఒక మాట వినిపొమ్ము.

కృష్ణు:—(నవ్వి) ఈయువతి మాటలసవ్వడిని గనిపెట్టి కృష్ణుఁడని నిర్ణయించినది గాఁబోలు కానిమ్ము. యిప్పుడిట్లు పలికిచూచెద. (పైకి) ఆర్యా! లోకంబున మగవారలు నమ్మఁదగినవారు కారు. అట్టులేగదా!

ఉ॥ ఉల్లస మాడుచున్ సతుల ♦ నూరకఁ గల్లలు గొన్ని పల్కుచున్
జల్లఁగఁజీరి కార్యములు ♦ జక్కబడంగ మొగంబు జూపఁగా
నొల్లరనంతరంబున మఱిదోద్ధతిఁ బిల్చినఁ బల్కరట్టి వా
రెల్లర వాక్యముల్ వినుట ♦ కెట్టులఁ జిత్తము సమ్మతించెదున్.

(అనిపలుకుచు నొయ్యారముగ కృష్ణుఁడొక చెట్టుదరి కేగును.)

రాధ:—(కృష్ణుని జూడక వెళ్ళినట్లు భావించి) ఔరా! ఈ సుందరి యెవ్వతెయో కాని మొత్తముమీఁద నాచిత్తము గలంచివైచినది (కొంచమూరకుండి)ఎట్టులున్నను నాకోమలివృత్తాంతమరసి కడకు నాథునిపాదారవిందములు సందర్శించెదఁగాక (అని నడచుచుండును.)

(తెరలో.)

జేవా! ఇటు, ఇటు.

రాధ :—(నిలువఁబడి) ఏమిది? నిపుణిక నన్ను వెతకికొనుచు మావారి నిటకుఁ దోడ్కొని వచ్చుచున్నదా యేమి? (కొంతవడి విచారించి) కానిమ్ము నాథుని దర్శించినవెనుక నంతయు జూచుకొనవచ్చును. (అని వెళ్ళుచున్నది.)

(అంతఁబైనఁ జెప్పబడినవిధమున నంద వృషభానులతోఁ బ్రవేశించి)

నిపు :—దేవా! ఇటు, ఇటు.

వృష :—(విచారముతో) నిపుణికా! నీచెలికత్తియ యింకను గనఁబడదుగదా? అయ్యో! ఏమిచేయుదును. ఈ ఘోరారణ్యమున నేమృగముల కెరయయ్యెనో యని చిత్తంబు తత్తరపడుచున్నది. నాఁడు వలదన్నను వినక ముద్దుకొమరిత యగు రాధికను నిర్బంధించితిని. రాధాకృష్ణుల ప్రేమమయసాగరమునకు వారధిఁగట్ట సాహసించిన నాయట్టి యవివేకి యింకొక డుండడు? అయ్యో! ఇంకెక్కడిరాధ! ఇంకెక్కడి జీవితము!

(అని మోహము వహించుచున్నాఁడు.)

నిపు :—(కన్నీరు తుడుచుకొనుచు) ధీరప్రశాంతుల రగు మీరలే యిట్లు ధైర్యము గోలుపోయిన పక్షమున నిఁక నాయట్టి యల్పమతి నూరడింపు వా రెవ్వరు?

నందు :—బావా! ఊరడిల్లు మూరడిల్లుము.

వృష :—(విషాదముతో) అయ్యో! ఇంకెక్కడి యూరడిల్లుట, ఎక్కడి శాంతిఁజెందుట, జీవితసర్వస్వమును గోలుపోయిన నాకంతయు నంధకారమై గనుపట్టుచున్నది. బావా!

ఉ॥ మక్కువగన్న పుత్రి కవమానమొనర్చియుఁ బెక్కుబాధలన్
స్రుక్కఁగఁజేసి "తండ్రి! కృపఁ జూడు"మటంచును బల్కువేళ నే
నక్కట మందబుద్ధి విననైతి గుమారికఁ గోలుపోతి నిం
కెక్కడిరాధ! యేమిగతి యెక్కడి కృష్ణుఁడు యేను దండ్రినే?

(అని కన్నీరు తుడుచుకొనుచు బ్రక్కకొఱఁగును.)

నిపు :—(పట్టుకొని కూర్చుండఁబెట్టి యెదుటఁజూచి సంతోషముతో) దేవా! అటుచూడుఁడు బ్రహ్మదేవునిచే ననుసంధానింపఁ బడు చున్న స్వస్వరూపధారు లగు రాధాకృష్ణు లిటే వచ్చుచున్న వారలు!

వృష :—(తత్తరపాటుతో లేచి) ఎక్కడ! ఎక్కడ! తల్లీ! ఎక్కడ! మా రాధకూడ వచ్చుచున్నదా! కృష్ణుఁ డేడీ! (అని వెఱ్ఱివాని వలె పరుగిడుచుండును)

నందు :—నిపుణికా! మనముగూడ నావంకకే నడచెదములెమ్ము. (అనినడచుచున్నారు.)

(అంతఁ బైనఁ జెప్పఁబడిన విధమున రాధాకృష్ణులు ప్రవేశించుచున్నారు.)

బ్రహ్మ :—తల్లీ, రాధా దేవీ! (అని రాధకరంబును బట్టుకొని.)

మ॥ఘన నీలాభ శరీరుఁడైన యితఁడే ♦ కంజాక్షుఁ డోయమ్మ (అనికృష్ణుని వైపునకుదిరిగి చేయిఁబట్టుకొని) నీ
కనుకూలంబుగఁ సంచరించుసతి కృ♦ష్ణా యీపెయే రాధ (అని రాధచేతియందుఁ గృష్ణుని కరం బిడి) యెం
తని చెప్పంగలవాఁడ మీచెలిమి రా♦ధా మాధవీయం బటం
చనఁగాఁ గీర్తివహించు లోకమునఁ దా ♦ నాచంద్రతారార్కమై.

(పైనుండి దేవతలు కుసుమములు చల్లుదురు.)

బ్రహ్మ :—ఆహా! ఏమి నాభాగ్యము! దేవతలు మెచ్చునట్లు బురాణ దంపతు లగు రాధాకృష్ణులకుఁ బాణిగ్రహణమహోత్సవ మొనరించి యిప్పు డెంతయో కృతకృత్యుఁడనైతిని.

(తెరలో.)

నేటికిఁగదా వినఁదగినమాట వింటిమి.

రాధ :—(విని) మనోహరా! మనవారలే కాఁబోలు యిటు వచ్చుచున్న వారలు.

కృష్ణు : –(సంతోషముతో) నే డెంతయో సుదినముగదా!

(అంతఁ బైనఁజెప్పఁబడినట్లు నందాదులు ప్రవేశించుదురు.)

వృష :—(పరుగిడినచ్చి) నన్నుఁగన్నతల్లీ! రాధా! కనఁబడితివా!
(అని సమీపించును.)

రాధ :—(సాదరమున తండ్రిపాదములమీఁద వ్రాలుచున్నది.)

వృష :—(లేవఁదీసి రాధను ముద్దాడును.)

నందు:—నాయనా! కృష్ణా! ఎన్నిదినములకుఁ గనఁబడతివోయీ!
(అని కౌఁగిలించుచున్నాఁడు)

వృష :—(సంతోషముతో) ఔరా! నాభాగ్యమేమని కొనియాడు
దును, రాధాకృష్ణులకుఁ గానున్న పాణిగ్రహణమహోత్స
వము సృష్టికర్తయగు విధాతయే స్వయముగా నొనరించెను.
(అని బ్రహ్మను జూచి) దేవా! ఈ దీనుఁడొనరించు యభి
వాదనము లందుకొనుఁడు, (అని పాదములమీఁదవ్రాలును.)

బ్రహ్మ :—(లేవదీసి) వత్సా! చిరంజీవివిగమ్ము. పరదేవత యగు
రాధామహాదేవిని గనిన నీ వెంతయో ధన్యుఁడవైతివి!

రాధ :—(చిఱునవ్వు నవ్వుచు) ఏమే! నిపుణికా? వెఱ్ఱిదానివలె నచ్చ
టనే నిలవఁబడితివి ఇటురమ్ము. (అని కౌఁగిలించుకొనుచున్నది)

నిపు :—(సంతసముతో) రాధా! ఎన్నియిక్కట్టులు వచ్చినను గృష్ణుని
చేపట్టఁగలవని నాఁడు పలికినదంతయు నిప్పుడు నిక్కువమయ్యె
నా! (అని నవ్వుచున్నది.)

రాధ :—(చిఱునవ్వు నవ్వి) ఇదంతయు నీకృపయే గదే నిపుణికా!

వృష :—నాయనా! కృష్ణా! యదునందనా! నావలనఁ బొసఁగిన దొసఁ
గుల సైరించి నాముద్దు కొమరితయగు రాధిక నేలుకొనుము.
(అని రాధవంక సాభిప్రాయముగ జూచుచున్నాఁడు.)

రాధ :—(గ్రహించి నిపుణికవద్దనున్న మందారమాల నందుకొని
కృష్ణునిమెడలో లజ్జతో మెల్లఁగ వేయుచున్నది.)

(తెరలో దుందుభులు మ్రోగుచుండును.)

కృష్ణు :—సుందరీ! ఇప్పటికి నీముద్దు చెల్లినదా!

